# దైవ గ్రంథములో
# సత్యాసత్య విచక్షణ

| | | |
|---|---|---|
| శూన్యము | - | కనిపించదు |
| శబ్దము | - | కనిపించును |
| పాపము | - | కనిపించదు |
| శిక్ష | - | కనిపించును |
| దేవుడు | - | కనిపించడు |
| జ్ఞానము | - | కనిపించును |
| జిబ్రయేల్ | - | కనిపించడు |
| బోధ | - | కనిపించును |


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# దైవ గ్రంథములో సత్యాసత్య విచక్షణ


<u>రచయిత</u>

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (81) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : అక్టోబర్–2016

ప్రతులు : 1000 **వెల : 50/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
79) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
80) గీటురాయి
81) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
82) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
83) భావము-భాష
84) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
**85) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**86) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**87) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**88) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

*DVD'S*

62. కర్మ లేని కృష్ణుడు–
    కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం–
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ–పు / లింగము.
65. దేశం మోసం–దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం–
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు–
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ – నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము–ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ–దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
89. 6–3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి–భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము–అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి–శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము – బోధ.
110. ఆట – దోబూచులాట.
111. ప్రజలు – మానవులు.
112. ఆస్తి – దోస్తి.
113. దంతము–అంతము.
114. మాయ మర్మము– ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు
    చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
    ప్రథమ వాక్యములు.
117. అదురు–బెదురు.
118. శవము.
119. ఆధ్యాత్మిక ప్రశ్నలు – జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

---

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# దైవ గ్రంథములో సత్యాసత్య విచక్షణ

దైవగ్రంథము పేరు ఒక్కటే అయినా గ్రంథములు మూడు గలవు. వాటిని పాత భాషలో చెప్పితే తౌరాతు, ఇంజీలు, ఖుర్ఆన్ గ్రంథములు అని అంటాము. మూడు గ్రంథములను మానవులు అర్థము చేసుకొనులాగున ఆయా ప్రాంత మానవులకు, ఆయా ప్రాంత భాషలలో మూడు గ్రంథములు వ్రాయబడి మనుషుల వద్దకు వచ్చాయి. ఈ మూడు గ్రంథములను క్రొత్త భాషలో చెప్పితే ప్రథమ దైవగ్రంథముగా వ్రాయబడి మొదట మనుషుల వద్దకు వచ్చినది భారతదేశములో భగవద్గీత. తర్వాత మూడు వేల సంవత్సరములకు ద్వితీయ దైవగ్రంథముగా హెబ్రీభాషలో వ్రాయబడిన బైబిలు, ఇశ్రాయెల్ దేశములో తయారయినది. తర్వాత ఆరువందల సంవత్సరములకు అంతిమ దైవగ్రంథముగా చివరిలో వ్రాయబడినది ఖుర్ఆన్ గ్రంథము. ఖుర్ఆన్ గ్రంథము అరబ్ దేశములో తయారయినది.

నేడు హిందూమతము అని చెప్పుకొను వారు భగవద్గీతను, క్రైస్థవులు బైబిలు గ్రంథమును, ముస్లీమ్‌లు ఖుర్ఆన్ గ్రంథమును విశ్వసించుచున్నారు. అయితే క్రైస్థవులు బైబిలును, ముస్లీమ్‌లు ఖుర్ఆన్‌ను నూటికి నూరు శాతము విశ్వసించి చదువుకోవడము జరుగుచున్నది. ఒక్క హిందూమతములో మాత్రము అందరూ పూర్తిగా భగవద్గీతయే తమ గ్రంథమని అనుకొనువారు చాలా తక్కువ. కొందరికి భగవద్గీత అంటే ఏమిటో తెలియదు. కొందరికి తెలిసినా భగవద్గీత ధర్మములనే ఆచరించవలెనను విషయము తెలియదు. కొందరికి భగవద్గీత హిందువులదని కూడా తెలియదు. బాగా తెలిసిన పండితులను అడిగితే వారు భగవద్గీత మీద కొంత అసూయకల్గి మాట్లాడడము, భగవద్గీత అందరూ చదివే గ్రంథము కాదు అని చెప్పు చున్నారు. హిందువులు వేదములను చదువవలెననీ, వేదములే హిందువుల గ్రంథములని కొందరు చెప్పగా, మరికొందరు వేదములను శుచిశుభ్రము

గలవారే చదువవలెను, అందరూ చదువకూడదని కూడా చెప్పుచున్నారు. మిగతా రెండు మతముల వారికి క్రైస్థవులు యెహోవా అనియూ, ముస్లీమ్‌లు అల్లాహ్ అనియూ ఒకే దేవున్ని చెప్పుచున్నారు. హిందూమతములో హిందువులకు ఫలానా దేవుడని చెప్పు విధానము కూడా లేదు. హిందువులలో అనేక దేవుళ్ళ పేర్లను చెప్పుచున్నారు. బహు దేవతారాధనే హిందువుల సనాతన ధర్మమని చెప్పుచున్నారు. హిందూ మత జనాభాలో సగమునకు పైగా దేవుని విషయమును పట్టించుకోకుండా బ్రతికేవారున్నారు. వారు దేనిని చూడక వారి పనిలో వారు లగ్నమై పోవుచుందురు. వారికి దేవుడుగానీ, భక్తిగానీ ఏమీ ఉండవు. మిగతా సగము మందిలో కొంత భక్తియున్నా అది గ్రామదేవతల మీదనో, సాధారణ దేవతల మీదనో ఉండును. మిగతా కొందరికి భారత, భాగవత, రామాయణ గ్రంథములను చదివే అలవాటుండును. వారికి అదే భక్తి, అదే జ్ఞానము. హిందువులలో చాలా తక్కువమంది భగవద్గీతను చూచిన వారు గలరు. వారిలో చదివిన వారు మరీ తక్కువ. చదివిన వారిలో భగవద్గీతను అర్థము చేసుకొన్న వారు కొన్ని వేలలో ఒకరు ఇద్దరు కూడా లేకుండా పోవడమును చూస్తే, భగవద్గీత హిందువులకు ఎంత అనుబంధముగా ఉందో తెలిసిపోవుచున్నది.

మిగతా రెండు మతముల వారు వారి గ్రంథములను గొప్పగా చూచుకొనుచుండగా, హిందువులు మాత్రము వారివలె కాకుండా భగవద్గీతను గొప్పగా చెప్పుకోవడముగానీ, గొప్పగా చూచుకోవడముగానీ, గొప్పగా భావించుకోవడముగానీ లేదని చెప్పవచ్చును. ఏ మతములో లేని భక్తి భావము హిందూమతములోయున్నా అది విచక్షణ లేనిదై, లాభమా నష్టమా అను లెక్కలేనిదై, చేయవలసినదా కాదా! యని ఏమాత్రము ఆలోచన చేయనిదై ఉన్నది. ఎవరి దారి వారిదన్నట్లు గురువులు సహితము

అనేక విధములుగా బోధించుచూ, ఒక దేవుడని నిర్ధారణ చేయకుండా ఎవరి ఇష్ట ప్రకారము వారిని ఆరాధించవచ్చని చెప్పుచున్నారు. భగవద్గీత ఎంతో గొప్ప జ్ఞానము కలదియైనా, హిందువులకది సరిగా అర్థము కాలేదనియే చెప్పవచ్చును. మిగతా మతముల వారు వారి గ్రంథముల మీద భక్తిని ప్రదర్శించుచున్నా, హిందువులకు అర్థము కానట్లే వారికి కూడా అర్థము కాలేదని చెప్పవచ్చును. భక్తి విశ్వాసములున్నా గ్రంథములోని జ్ఞానము మిగతా మతముల వారికి అర్థము కాకపోగా, భగవద్గీతా గ్రంథము మీద భక్తి విశ్వాసములు లేక హిందువులకు అర్థము కాలేదు. మొత్తము మీద హిందూ, క్రైస్థవ, ముస్లీమ్ అను మూడు మతముల వారికి మూడు గ్రంథములు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. అయినా మూడు మతముల వారు తమకు తమ గ్రంథములు అర్థమయినాయని అనుకొంటున్నారు.

**1) ప్రశ్న :- మూడు మతములు ఉన్నాయి సరే! వారిలో హిందువులకు భగవద్గీత, క్రైస్థవులకు బైబిలు, ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ గ్రంథము అని మీరు చెప్పు మాటలలో అర్థమయినది. ఫలానా మతము వారికి ఫలానా గ్రంథమని దేవుడు ఏర్పరచి ఇచ్చాడా?**

**జవాబు :-** ఏ మతమునకు ప్రత్యేకముగా ఏ గ్రంథమును దేవుడు ఇవ్వలేదు. అయినా క్రైస్థవులు తమది బైబిలు అని చెప్పుచున్నారు. ముస్లీమ్‌లు తమ గ్రంథము ఖుర్ఆన్ గ్రంథమని చెప్పుచున్నారు. చివరకు మిగిలిన భగవద్గీతను తమదని హిందువులు అంటున్నారు. క్రైస్థవులు, ముస్లీమ్‌లు వారి గ్రంథములను చెప్పుకోగా చివరిలో మిగిలిపోయిన భగవద్గీతను తమ గ్రంథమని హిందువులు చెప్పడమైనది. ఈ విధముగా మూడు మతముల వారు మూడు గ్రంథములను చెప్పుకొంటున్నారు. అంతేగానీ దేవుడు ఎవరితోనూ ఈ గ్రంథము క్రైస్థవులదని చెప్పడముగానీ, ఖుర్ఆన్

ముస్లీమ్‌లదని చెప్పడము గానీ, భగవద్గీత హిందువులదని గానీ చెప్పలేదు. మనుషులే ఎవరంతకు వారు వారి పెద్దలు అనుసరించినట్లు అనుస రించుచూ దానినే తమదని చెప్పుకొంటున్నారు.

ఏసు పుట్టినప్పుడే నాలుగు సువార్తలు పుట్టాయి. ఆ నాలుగు సువార్తలు బైబిలు గ్రంథములో చేర్చబడినాయి. ఏసు జీవిత చరిత్రతో సంబంధమున్న నాలుగు సువార్తలుండుట వలన, అక్కడినుండే క్రైస్థవులు ఏర్పడుట వలన, నాలుగు సువార్తలుగల మొత్తము బైబిలు క్రైస్థవులకు అలవాటైపోయినది. అలాగే ముహమ్మద్ ప్రవక్త ద్వారా తెలిసినది ఖుర్‌ఆన్ గ్రంథము. ముహమ్మద్ ప్రవక్తతో ప్రారంభమయిన ఖుర్‌ఆన్ గ్రంథమునకు ముస్లీమ్‌లు అలవాటైపోయారు. అలాగే ముందే తయారయిన భగవద్గీతను హిందువుల గ్రంథమని చెప్పుకోవడము జరిగినది. ఈ విధముగా మూడు మతముల వారికి మూడు గ్రంథములు అలవాటైపోయాయి. ఫలానా గ్రంథము ఫలానా మతమునకు అని దేవుడు మనుషులకు చెప్పలేదు. మనిషి తన ఇష్టమొచ్చినట్లు ఇది తమ మతమని, మరొకటి ఇతరుల మతమని నిర్ణయించుకొన్నాడు. అట్లే గ్రంథములను ఏర్పరచుకొన్నాడు.

**2) ప్రశ్న :- విచక్షణా జ్ఞానమంటే ఏమిటి?**

**జవాబు :-** మనిషి నాది ఫలానా మతము అను విచక్షణ కల్గియున్నప్పుడు నా మత గ్రంథము ఫలానా యను విచక్షణ కూడా ఉండును. ముస్లీమ్‌కు భగవద్గీతను చూపించినా, లేక బైబిలును చూపించినా ఇది మా గ్రంథము కాదని, మా గ్రంథము ఖుర్‌ఆన్ అని చెప్పును. అతనికి నేను ముస్లీమ్ అను ధ్యాస ఉండడమేకాక, గ్రంథమును చూచినప్పుడు తనకున్న విచక్షణతో ఇది ఫలానా మతము వారిదని, నా మతమునకు సంబంధించిన గ్రంథము

కాదని గుర్తించగలుగుచున్నాడు. ఇది అవును, ఇది కాదు అను వివరమును తెలియగల్గడమే **విచక్షణ**యని అంటున్నాము. ఇంకా వివరముగా చెప్పుకొంటే ఇంటిలో నివసించు మనుషులను ఫలానా మనిషి నా భార్య, ఫలానావారు నా తల్లి, తండ్రి, ఫలానావారు నా బిడ్డలు, ఫలానావారు నా అన్నతమ్ములు అని వేరుపరచి తెలియడమే విచక్షణాశక్తి లేక విచక్షణా జ్ఞానము అని అంటాము. మనిషిలోని విచక్షణా జ్ఞానము అనునది ఒక కుటుంబములోని మనుషులనేకాక, బయట మనుషులనుగానీ, బయట వస్తువులనుగానీ, గ్రంథములనుగానీ, గ్రంథములోని విషయమును గానీ వేరువేరుగా తెలియగల్గి వాటియందుగల కొద్దిపాటి తేడాను కూడా గుర్తించడమును **విచక్షణ** అని అంటున్నాము. డబ్బు విషయములోనికి వస్తే వంద రూపాయల నోటును, ఐదువందల నోటును, వేయిరూపాయల నోటును ఏమాత్రము పొరపాటు పడకుండా గుర్తించగలుచున్నాము. అలా వాటియందు గల వ్యత్యాసమును గుర్తించి సులభముగా డబ్బును గుర్తించు చున్నాము. ఒకవేళ పది, ఐదువందల రూపాయల నోటులలో ఒక దొంగనోటు కలసివచ్చినా, ఒరిజినల్ నోటుకు డూప్లికేట్ నోటుకు గుర్తించ లేని చిన్న వ్యత్యాసమును కూడా గుర్తించి, ఇది దొంగనోటు అని చెప్పగలుగుటనే మనిషికి ఉన్న విచక్షణా జ్ఞానము అంటాము.

**3) ప్రశ్న :- జంతువులలో విచక్షణా జ్ఞానము ఉంటుందా?**

**జవాబు :-** ఉంటుందనియే చెప్పవచ్చును. ఎందుకనగా! జంతువులయినా అవి వాటి పిల్లలను గుర్తుపట్టుచున్నవి. అలాగే పిల్లలు తల్లులను గుర్తు పట్టుచున్నవి. విచక్షణా జ్ఞానము లేనిది అవి ఒకదానినొకటి ఎలా గుర్తు పట్టగలవు? పచ్చిగడ్డిని చూస్తే రుచికరమైన ఆహారమని గుర్తుపట్టగలవు.

**4) ప్రశ్న :- మనిషిని జంతువును పోల్చిచూస్తే దేనికి విచక్షణా శక్తి ఎక్కువ యుండును?**

**జవాబు :-** విచక్షణా శక్తి యనునది అవసరమును బట్టి, జీవన విధానమును బట్టి జంతువులకుగానీ, మనుషులకుగానీ అమరియుండును. కొన్ని సందర్భములలో, కొన్ని విషయములలో మనుషులకంటే జంతువులకే ఎక్కువ విచక్షణ యుండును. అట్లే కొన్ని విషయములలో మాత్రము జంతువులకంటే మనుషులలో ఎక్కువ విచక్షణ ఉండును. మనుషులకు ఎక్కువ విషయములు ఉండగా, జంతువులకు తక్కువ విషయములుండును. ఒక మనిషిలో తక్కువ మరొక మనిషిలో ఎక్కువ విచక్షణా శక్తి యున్నట్లు జంతువులలో కూడా ఒక దానికి మరొక దానికి తేడాయుండును.

**5) ప్రశ్న :- జంతువుకు ఒక రకము, మనుషులకు మరొక రకముగా విచక్షణ యుండుటకు కారణమేమి? మనుషులలోగానీ జంతువులకుగానీ ఒకే రకమైన విచక్షణ ఎందుకు లేదు?**

**జవాబు :-** విచక్షణా శక్తి లేక విచక్షణా జ్ఞానము మనుషులకుగానీ, జంతువులకుగానీ ప్రపంచ సంబంధము, పరమాత్మ సంబంధమని రెండు విధముల ఉండును. ప్రపంచ సంబంధమైనది కర్మనుబట్టి యుండును. పరమాత్మ సంబంధమైనది వారి శ్రద్ధనుబట్టి ఉండును. మనిషికిగానీ జంతువుకుగానీ ప్రపంచ సంబంధ విచక్షణా శక్తి వారివారి కర్మనుబట్టి యుండును. అదే దైవికమైనదైతే మనిషికి దేవునిమీద గల శ్రద్ధను బట్టి లభ్యమైయుండును. ప్రపంచ సంబంధమైన అనేక విషయములందు అనేక రకములుగా విచక్షణ యుండుటకు ముఖ్యముగా కర్మే కారణము. కర్మ వలన మనిషికి ఎంత విచక్షణ ఉండవలెనో అంతే లభ్యమైయుండును.

దైవ విషయములలో దేవునిమీద శ్రద్దతోగానీ, దేవుని జ్ఞానము మీద శ్రద్ధను బట్టిగానీ విచక్షణా శక్తిని దేవుడే మనిషికి ఇచ్చియుండును. ఇక్కడ దేవుడు ఇచ్చాడని దేవుని గౌరవార్థము చెప్పుచున్నాముగానీ, దేవుడు ఏదీ ఇచ్చువాడు కాడు. శరీరములో జీవాత్మను నడుపుచున్న ఆత్మే మనిషికి విచక్షణా శక్తిని ఇచ్చుచున్నది. ఆత్మ ఇచ్చిన విచక్షణను బట్టి మనిషికి ఆత్మ విషయములు తెలియును. ఆధ్యాత్మిక విషయములను విపులముగా యోచించు విచక్షణా బుద్ధిని ఆత్మే ఇచ్చుట వలన ఆత్మజ్ఞానము మనిషికి సాధ్యమగుచున్నది. కొందరికి సాధ్యము కాకున్నది.

**6) ప్రశ్న :- ప్రపంచ విషయములలో విచక్షణ తేడా ఎలా తెలియగలదు?**

**జవాబు :-** ఒకనికి మంచిగ కనిపించినది ఇంకొకనికి చెడుగా కనిపించిన దనుకో, అప్పుడు ఇద్దరి మనుషులలో విచక్షణా జ్ఞానము హెచ్చు తగ్గులున్నట్లే కదా! ఒకడు ఒక విషయమును న్యాయమంటే మరొకడు అదే విషయమునే అన్యాయమంటాడనుకో, అప్పుడు వారిద్దరిలో అభిప్రాయ భేదములు కన్పించుచున్నవి కదా! అప్పుడు వారిలో విచక్షణ వేరువేరుగా యుండడము వలన ఒక్కొక్కరికి ఒక్కొక్క రకముగా అర్థమయినందున అలా అభిప్రాయ భేదములు వచ్చాయని చెప్పవచ్చును. ఒకరు చెప్పు విషయమును వినినా అందులోని భావమును గ్రహించుకోలేని బలహీన బుద్ధిగలవారు, వారి బుద్ధికి ఉన్న బలమునుబట్టి వినే విషయము అర్థము చేసుకోగలరు. అప్పుడు వారికి అర్థమయినదే సత్యమని అనుకొనుచుందురు. వారు సత్యము అనుకొన్నంతమాత్రమున అది సత్యము కాదుకదా!

యదార్థ సంఘటన ఒకటి నీకు అర్థమయ్యే దానికి చెప్పెదను. నేను ఆధ్యాత్మిక సిద్ధాంతకర్తను. శంకరాచార్యుల వారు అద్వైత

సిద్ధాంతమును, రామానుజాచార్యుల వారు విశిష్టాద్వైతమును, మధ్వాచార్యుల వారు ద్వైతమును ప్రకటించినట్లు నేను స్వయముగా లోకమునకు తెలియని త్రైత సిద్ధాంతమును ప్రకటించాను. కావున నన్ను అందరూ త్రైత సిద్ధాంతకర్త యని శంకరాచార్యులను, రామానుజాచార్యులను, మధ్వాచార్యులను అన్నట్లే అనుచుందురు. అంతేకాక మా రచనా గ్రంథముల మీద ఫలానా వ్యక్తి వ్రాశాడు అని తెలియుటకు నా పేరు ముందర త్రైత సిద్ధాంత ఆదికర్తయని వ్రాయడము జరిగినది. అయితే కొందరు అసూయ కల్గినవారు మిగతా సిద్ధాంతకర్తల ఫోటో ప్రక్కన నా ఫోటోను చూడలేక, ద్వేషముతో నన్ను దూషించు ధోరణిలో "శంకరాచార్య, మధ్వాచార్యుల అంతటి వానివా నీవు?" అని మాట్లాడడము జరిగినది. అటువంటి వారికి మేము లెక్క లేనప్పుడు మమ్ములను గొప్పగా లెక్కించు వీరబ్రహ్మముగారి పేరు చెప్పి ఆయన స్వయముగా నన్ను **"సిద్ధాంత శిరోమణి"** అని చెప్పాడు. అటువంటప్పుడు మీ లెక్కలో నేను సిద్ధాంతకర్తను కాకున్నా, బ్రహ్మముగారి లెక్కలో సిద్ధాంతకర్తనే అని చెప్పడమైనది. అక్కడ నన్ను విమర్శించిన వారిని ఉద్దేశించి నేను చెప్పగా, దానిని సందర్భానుసారం గ్రహించుకోలేని వారు నన్ను విమర్శించుచూ అనగా వేలెత్తి చూపుచూ ఇలా అన్నారు. "ప్రబోధానందస్వామి తన పుస్తకాల ప్రచార నిమిత్తము బ్రహ్మముగారి రెకమండేషన్ కొరకు వెంపర్లాడినట్లు కనిపిస్తుంది. అది పాఠకులకు చెట్టు పేరు చెప్పి కాయలు అమ్మే విధముగా చీకాకు తెప్పిస్తుంది. కొన్ని ధ్వని సారూప్యత పదాలతో ఉదాహరణగా చూపి బ్రహ్మముగారు ప్రబోధానంద గురించే చెప్పాడని చెప్పడానికి ప్రయత్నించడము పాఠకులకు ఇబ్బందిగా ఉంటుంది" అని అన్నాడు. ఇది చూచిన తర్వాత ఇతనికి విచక్షణ లేదని నాకు తెలిసిపోయినది. ఒక సందర్భములో బ్రహ్మముగారు నా పేరు, నా ఊరు పేరు, నా కులము పేరుతో సహా వ్రాసియున్నా అది అర్థము

కాకపోవడము, నన్ను విమర్శించడము, నేను ఇతరుల రెకమండేషన్ కొరకు ప్రాకులాడినట్లు చెప్పడము చూస్తే, విచక్షణా లోపమని తప్పనిసరిగా అనుకోవలసిందే. నేను ఏ సందర్భములో బ్రహ్మముగారి ప్రస్థావన తెచ్చానో అతనికి అర్థము కాలేదు. ఈ విధముగా కొందరి మనుషులలో విచక్షణా లోపము ఎక్కువగా ఉండును. కొందరిలో తక్కువగాయుండును. ఇదంతా వారి కర్మనుబట్టి బుద్ధికిగల గ్రహించుశక్తిలో తేడాలుండును. దానినే విచక్షణలో తేడాలని చెప్పవచ్చును. విచక్షణ వలననే ఇతరులలో గల సత్యమునుగానీ, అసత్యమునుగానీ తెలియవచ్చును.

**7) ప్రశ్న :- మనిషికి గల బుద్ధి సామర్థ్యమునే, గ్రహించుకొను శక్తి సామర్థ్యమునే విచక్షణాశక్తి అంటున్నాము కదా! అది ప్రపంచ విషయము లలో పనిచేసినట్లు దైవికమయిన పరమాత్మ విషయములో ఎందుకు పని చేయదు? ప్రపంచ విచక్షణా శక్తికి కర్మ కారణమైనప్పుడు పరమాత్మ విషయములోని విచక్షణకు శ్రద్ధ ఎందుకు అవసరమైనది?**

**జవాబు :-** ప్రపంచమంతా కర్మ నిర్మితము, దైవికమంతా శ్రద్ధ నిర్మితము. అందువలన మనిషికి గల బుద్ధి ప్రపంచ విషయములను గ్రహించునట్లు దేవుని విషయములను గ్రహించుకోలేదు. కావున దైవిక విషయమును విని దానిని ప్రపంచ విషయముగా తలచువారు కూడా కలరు. కొందరు బుద్ధి లోపము వలన ప్రపంచ విషయమును దైవ విషయమని కూడా అనుకొనుచుందురు. చివరికి వారు తమ బుద్ధిలోపమును తెలియలేక తమది అంతా సత్యము ఇతరులదంతా అసత్యమని అనుకొనుచుందురు. కొందరికి ప్రపంచ విషయములలో 100 శాతము బుద్ధి పనిచేయగా, పరమాత్మ విషయములో కేవలము 10 శాతము మాత్రమే పని చేయువారు కలరు. ఇంకా కొందరు 1,2 శాతము, కొందరు జీరో శాతము పని

చేయువారు కలరు. కొందరు ప్రపంచ విషయములో 50 శాతము బుద్ధి పనిచేయగా, పరమాత్మ విషయములో 90 నుండి 100 శాతము వరకు బుద్ధి పని చేయువారు కలరు. కొందరికి ప్రపంచ విషయములో తక్కువ దేవుని విషయములో ఎక్కువ బుద్ధి పని చేయగా, కొందరికి ప్రపంచ విషయములో ఎక్కువ దేవుని విషయములో తక్కువ పనిచేయువారు గలరు. ప్రపంచ విషయములలో విచక్షణ ఎలాయున్నా అది ఇహ లోక సంబంధమైనది. ఒకవేళ తక్కువ యున్నా ప్రపంచ విషయముల అవగాహనే అయిన దానివలన అది ప్రపంచ సంబంధ లాభ నష్టములతోగానీ, ప్రపంచ సంబంధ సుఖ దుఃఖములతోగానీ ముడిపడి యుండును. అదే పరమాత్మ విషయమైతే, మనిషికి జీవితములో లభించవలసిన జ్ఞానము లభించకుండా పోవును. మనిషి పుట్టి జ్ఞానమును, జ్ఞానశక్తిని సంపాదించుకోలేకపోతే అతనిది వ్యర్థ జీవితమగును.

**8) ప్రశ్న :- ప్రపంచ విషయములైతే నిత్యము అవసరమైనవి. అన్ని సమయములలో వాటియందే ఉందుము, కనుక తప్పనిసరిగా ఆ విషయముల సత్యాసత్య విచక్షణ అవసరము. దైవ విషయములను ఎవరూ మాట్లాడరు. అటువంటప్పుడు వాటి సంబంధమే తక్కువగాయుండును. అందువలన ప్రస్తావనకే రాని విషయములలో విచక్షణ ఎలా అవసరము?**

**జవాబు :-** ప్రపంచ విషయములున్నట్లు దైవ విషయములను ఎవరూ మాట్లాడకపోవచ్చును. దైవ విషయముల సంబంధము ఎక్కడా ఎవరిలో లేనప్పుడు దైవ సంబంధ విషయముల విచక్షణతో అవసరమే లేదు కదా!యని మీరు అడుగుట వాస్తవమే అయినా, అట్లు ఊరకయుండక, జీవితమును వృథా చేసుకోకుండా, జీవితమును దేవుని విషయములతో సంబంధము పెట్టుకొని, జీవితమును సార్థకము చేసుకొనునట్లు దేవుడు

ఏర్పాటు చేసిపెట్టాడు. మనిషి జీవితమునకు అవసరమైన జ్ఞానమును గురించి ఎవరూ మాట్లాడకపోయినా, వాటియందు విచక్షణ కల్గియుండునట్లు దేవుడు ప్రతి సమాజములోని మనుషులకు దేవుని జ్ఞానముతో కూడుకొన్న దైవ గ్రంథమును ఇచ్చాడు. ప్రతి మనిషి యుక్తవయస్సు రాగానే దేవుని జ్ఞానముతో సంబంధము పెట్టుకొను విధముగా దైవ గ్రంథములలోని జ్ఞానము కలదు. దైవ గ్రంథమును చదివినప్పుడు తప్పనిసరిగా బుద్ధిని ఉపయోగించి తెలిసిన విషయములో అనగా చదివిన విషయములో సత్యాసత్యమును తెలియవలసి యుంటుంది. ప్రపంచ విషయములలో ఎంతో విచక్షణ కల్గియున్న వాడు కూడా దైవ విషయములలో సత్యమును గ్రహించ లేకపోవుట జరుగుచున్నది. అందువలన దైవ విషయములలో మనిషి బుద్ధిని పెంచుకోవలసిన అవసరమున్నది.

**9) ప్రశ్న :- దైవగ్రంథములు మూడు వేరువేరుగా యున్నవి. మూడు గ్రంథములు వేరువేరు ప్రాంతములలో, వేరువేరు భాషలలో, వేరువేరు ప్రవక్తల ద్వారా వచ్చియుండడమేగాక, వేరువేరు మతముల వారు తమ గ్రంథములుగా చెప్పుకొంటున్నారు. అలా ఉండుట వలన అవి వేరువేరు దేవుళ్ళను గురించి చెప్పినట్లు ప్రచారము గలదు. మూడు గ్రంథములను బట్టి పరమాత్మ, యెహోవా, అల్లాహ్ అను ముగ్గురు దేవుళ్ళున్నట్లు తెలియు చున్నది. ప్రపంచములో మొత్తము పన్నెండు మతములు గలవు, వాటి ప్రకారము మొత్తము పన్నెండు మంది దేవుళ్ళు కలరా అని అడుగుచున్నాను? మిగతా దేవుళ్ళ పేర్లు తెలియవు, వారి పేర్లను చెప్పమని అడుగుచున్నాను, దయచేసి తెలుపండి?**

**జవాబు :-** దైవ గ్రంథములు మూడు ఉన్నది వాస్తవమే! అయితే ఆ మూడు

ఒకే గ్రంథమునుండి వచ్చినవే అయినందున, అందులో ఒకే దేవుని జ్ఞానమే గలదు. దేవుడు మూడు పేర్లతో చెప్పబడినా ముగ్గురు ఒక్కడేయని తెలియ వలెను. మూడు పేర్లు ఒకే దేవునివే. మిగతా తొమ్మిది మతములకు కూడా ఒకే దేవుడేయున్నాడు. ఎవరు ఏ పేరుతో చెప్పినా ఆ పేర్లన్నియూ ఒక్కనివేయని చెప్పవచ్చును. ఎందుకనగా! ప్రపంచమును సృష్ఠించినది ఒకే దేవుడే, ఆయనే అందరికీ సృష్ఠికర్త. వేరే సృష్ఠికర్త ఎవరూ లేరు. సృష్ఠించిన వాడు ఒక్క దేవుడే, సృష్ఠింపబడినది ప్రపంచములో కనిపించే జీవరాసులు, మనుషులు, జంతువులు వగైరా కలవు. కనిపించని జీవరాసులు దేవతలు, దయ్యాలు. వీరందరూ పాలింపబడువారు కాగా, పాలించే పరివారమైన భూతములు, గ్రహములు అను వారిని కూడా దేవుడే సృష్ఠించాడు. దేవుడు ఎవరు? సృష్ఠింపబడిన జీవరాసులలో పాలించబడే వారు ఎవరు? పాలించే వారు ఎవరు? మనుషులను దేవుడు ఎందుకు సృష్ఠించాడు? అని మొత్తము సమాచారమును తెలియడమే దేవుని జ్ఞానము తెలియడమని చెప్పవచ్చును. ఈ విషయములన్నియు కూలంకషముగా తెలియ చెప్పునవే దైవగ్రంథములు. దైవ గ్రంథములను తెలియగలిగితే మనిషియొక్క పుట్టుపూర్వోత్తరములు తెలియును.

**10) ప్రశ్న :- దైవగ్రంథములను చదివితే మనిషి యొక్క పుట్టు పూర్వోత్తరములు తెలియునన్నారు కదా! పుట్టు పూర్వోత్తరములంటే ఏమిటి?**

**జవాబు :-** మనిషి యొక్క మొదలు చివరలను పుట్టు పూర్వోత్తరములని అంటున్నారు. 'పుట్టు పూర్వోత్తరము' అను పదమును వివరముగా చెప్పితే మనిషి పుట్టుకను గురించి తెల్పునది మరియు మనిషి అంత్యమును గురించి చెప్పునది అని అర్థము చెప్పవచ్చును. విడదీసి చూస్తే పుట్టుపూర్వోత్తరము అను పదములో మూడు పదములు కలిసియున్నవి. **పుట్టు+పూర్వ+**

**ఉత్తరము** అను మూడు పదములు కలిసి **"పుట్టు పూర్వోత్తరము"** అను పదము తయారయినది. పుట్టు అనగా మనిషి యొక్క పుట్టుక అని తెలియుచున్నది. తర్వాత పూర్వ అనగా మనిషి పుట్టుక పూర్వము గత జన్మలు అనగా పుట్టుక ముందు గడచిన జన్మలు అని అర్థము. ఉత్తరము అనగా పుట్టుక తర్వాత వచ్చు మరణము అని అర్థము. ఇక్కడ ముందుగల రెండు పదములకు అర్థము సరిపోవుచున్నదిగానీ, చివరిలోయున్న 'ఉత్తరము' అను పదమునకు మరణము అని చెప్పడము వలన ఉత్తరమునకు మరణమునకు ఏమి సంబంధమని కొందరు అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు.

మనకు భూమిమీద నాలుగు దిక్కులు గలవు. తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అను నాలుగు దిక్కులలో తూర్పు పడమర దైవ సంబంధ దిక్కులుయని, దక్షిణ ఉత్తర దిక్కులు రెండు ప్రపంచ సంబంధ దిక్కులుయని జ్ఞానము తెలిసిన పెద్దలు చెప్పడము జరుగుచున్నది. వారి భావము ప్రకారము లోకమునకు వెలుగు నిచ్చు సూర్యునికి తూర్పు పుట్టుకకు, పడమర మరణమునకు గుర్తుగా ఉన్నవి. పుట్టుకను ఉదయించడము అని, మరణమును అస్తమించడము అని కూడా చెప్పుచుందుము. మనిషి పుట్టుక, చావుకు దక్షిణము ఉత్తరము రెండు దిక్కులు గుర్తుగాయున్నవి. మనిషి పుట్టుకకు దక్షిణ దిక్కు, అట్లే మరణమునకు ఉత్తర దిక్కు ప్రతీకగా యున్నవి. మనిషి చావుకు గుర్తుగాయున్న ఉత్తరమును అందరూ తెలియునట్లు మనిషి మరణము తర్వాత అంత్యక్రియలు చేయు స్మశానము ఊరికి ఉత్తర దిక్కుననే నిర్ణయించి పెట్టారు. చిన్నపిల్లప్పుడు నామకరణము చేసిన దినమున ఎప్పటికయినా మనిషి స్మశానమునకు పోవలసిందేయను భావముతో కాళ్ళు స్మశానమువైపు, తల పుట్టుక దిక్కయిన దక్షిణ దిశకు పెట్టి

పడుకోబెట్టడము జరుగుచున్నది. అందువలన 'తల దక్షిణమువైపు కాళ్ళు కాటివైపు' అని చెప్పుచుందురు. కాటి అనగా స్మశానము అని అర్థము. స్మశానము ఉత్తర దిక్కున ఉండుట వలన తల దక్షిణమునకు, కాళ్ళు ఉత్తరమునకు పెట్టి పడుకోబెట్టడము జరుగుచున్నది. అప్పుడే కాదు ఎప్పుడయినా కాళ్ళను కాటికి చాచినట్లు ఉత్తరము వైపుకు పెట్టి, తలను దక్షిణమువైపుకు పెట్టి పడుకోవడము మంచిదని ఇప్పుడు కూడా అక్కడక్కడ చెప్పుచుందురు. అంతేకాక "దాన ధర్మము లేకున్నా దక్షిణ తల పెట్టుకొని పడుకోవడము మంచిదని" పెద్దలు చెప్పుచుందురు. అలా పడుకోవడము వలన ఉత్తర దక్షిణమువైపు ప్రవహించుచున్న అయస్కాంతశక్తి తలనుండి శరీరమంతా ప్రవహించుట వలన శరీరములో రోగములున్నా తగ్గిపోవుననీ, శరీరమునకు రోగ నిరోధక శక్తి లభించునని చెప్పుచుందురు.

ఈ విధముగా ఉత్తరము దిక్కును మనిషి మరణమునకు గుర్తుగా ఉపయోగించి చెప్పెడివారము. అయితే నేడు ఉత్తరము అను పదము యొక్క అర్థము తెలియకుండా పోయినది. దైవగ్రంథమును చదవడము వలన మనిషికి సంబంధించిన జ్ఞానమంతయూ తెలియుచున్నది. అనగా మనిషి యొక్క పుట్టు పూర్వోత్తరములు తెలియుచున్నవి. ఈ మాటకున్న అర్థము ప్రకారము మనిషి పుట్టుకను మధ్యలోయుంచుకొని, పుట్టుకకంటే పూర్వము గత జన్మలున్నట్లు, అట్లే మనిషి పుట్టుక తర్వాత జన్మలున్నట్లు తెలిసి, జన్మలు లేకుండా చేసుకోగలిగితే మోక్షమున్నట్లు తెలియుచున్నది. 'పుట్టు పూర్వోత్తరము' అను పదములో పుట్టు ముందు చెప్పబడినా, అర్థములో పుట్టును మధ్యలో యుంచుకొని పుట్టుకకంటే ముందు వెనుక మనిషికున్న స్థితిని తెలియు స్థోమత దైవ గ్రంథములలోని జ్ఞానము వలన తెలియుచున్నది. గత జన్మలో ఎక్కడున్నామని కాకుండా పుట్టుకకంటే ముందు గత జన్మలు

ఉన్నాయను విశ్వాసమును దైవగ్రంథము కల్గించును. దైవగ్రంథము వలన పుట్టుక తర్వాత జన్మలు కలవనీ, జన్మలు లేకపోతే మోక్షము కలదని తెలియు చున్నది.

**11) ప్రశ్న :- దైవగ్రంథములు మూడు కలవు కదా! మూడు గ్రంథములలో ఏ గ్రంథము చదివినా, మనిషి యొక్క పుట్టు పూర్వోత్తరములు తెలియునా? లేక మూడు గ్రంథములు చదువవలెనా?**

**జవాబు :-** మూడు దైవగ్రంథములలో దేనిని చదివినా అవి మనిషియొక్క చావుపుట్టుకలను, గత జన్మలను, రాబోవు జన్మలను గురించి తెలియవచ్చును. అయితే మూడు గ్రంథములను చదువుట వలన ఒక గ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథముల ద్వారా ధృవీకరించబడుచున్నది. ఒక గ్రంథము లోని జ్ఞానము సత్యమైనదని, మిగతా రెండు గ్రంథములు సాక్ష్యమును చెప్పుచుండుట వలన, మనిషికి ఒక దైవగ్రంథములోని జ్ఞానము మిగతా రెండు గ్రంథములు చదువుట వలన మనిషిలో దృఢముగా నిలిచిపోవు చున్నది. మూడు గ్రంథములు ఒకదానికొకటి సాక్ష్యముగా యున్నవని తెలియగలదు. అందువలన ఏ మతస్థుడయినా ఒక గ్రంథమును కాక మూడు గ్రంథములను చదువవలెను. అట్లు చదవని వాడు ఏ ధర్మములో లేనట్లేయని అంతిమ దైవగ్రంథములో సూరా 5, ఆయత్ 68లో చెప్పి యున్నారు చూడండి. **(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాతు (భగవద్గీత), ఇంజీలు (బైబిలు), మీ ప్రభువు తరపున మీ వద్దకు పంపబడిన దానిని (ఖుర్ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మము పైనా లేనట్లే"**

ఖుర్ఆన్ గ్రంథములో ఈ వాక్యమును చూచిన తర్వాత మూడు గ్రంథములలోని జ్ఞానమును వాని జీవితములో అమలు పరచకపోతే,

ఆచరించకపోతే వాడు ప్రస్తుతము నేను ఫలానా మతస్థుడనని చెప్పుచున్నా, వాడు ఆ మతస్థుడు కూడా కాడు. చివరకు ఏ మత ధర్మములో కూడా లేనట్లుగానే లెక్కించబడును. నేను ముస్లీమ్ అను చెప్పువాడు మూడు గ్రంథములు చదవకపోతే మూడు గ్రంథముల జ్ఞానమును ఆచరించకపోతే వాడు ఏ ధర్మములో లేనట్లేయని దేవుడే తన గ్రంథమందు చెప్పియున్నాడు. ఈ మాట ప్రకారము మూడు గ్రంథములను గౌరవభావముతో చదువక పోతే ఖుర్ఆన్ గ్రంథములో దేవుడు చెప్పిన ఆయత్‌ను మనిషి లెక్క చేయలేదని చెప్పవచ్చును. అంతేకాక అట్టివానిని దేవుడు ఏ ధర్మములో లేనట్లే లెక్కించును. అందువలన నీవు ఏ మతస్థుడవైనా ఫరవాలేదు. మిగతా రెండు గ్రంథములను నీ గ్రంథముతో పాటు చదువవలెను. దేవుడు చెప్పినట్లు మూడు గ్రంథములను అసూయ లేకుండా చదువువాడు తొందరగా దేవుని సాన్నిధ్యమును చేరగలడు. అట్టివాడు మరణము తర్వాత జన్మకు పోడు. మరణము తర్వాత పరలోకమును పొందగల్గును.

**12) ప్రశ్న :- సాధారణ మనుషులకు ప్రపంచ విషయములలో బుద్ధి బాగా పని చేసినా, దైవ విషయములలో వారి బుద్ధి అంతంత మాత్రమే పని చేయును. అటువంటి వారికి దైవగ్రంథములో చెప్పబడిన విషయము సరిగా అర్థము కాలేదంటే ఒప్పుకోవచ్చును. అయితే మేము గొప్ప జ్ఞానులము అని ప్రకటించుకొన్నవారు, సమాజములో గురువులుగా గౌరవింపబడువారు, స్వామీజీలుగా చలామణి అగువారు దైవగ్రంథముల లోని ఏ విషయమునయినా సులభముగా గ్రహించుకొని, వివరముగా చెప్పగలుగు స్థోమత ఉండాలి. అటువంటివారు నేడు దైవ గ్రంథములోని విషయములను సరిగా గ్రహించుకోలేని స్థితిలోయుండి గ్రంథములో గల విషయమును ఉన్నది ఉన్నట్లు అర్థము చేసుకోలేక, అక్కడ గల వాస్తవ**

**విషయమును వదలి వేరే విషయమును, అక్కడ లేని విషయమును, అవాస్తవ విషయమును బోధించుచున్నారు. జ్ఞాన పెద్దలు, మత పెద్దలు అని పేరుగాంచిన వారు అలా వాస్తవముకాని అవాస్తవమును బోధిస్తే సామాన్య మనుషులు దైవగ్రంథములోని నిజ జ్ఞానమును ఎలా తెలియగలరు? దైవ గ్రంథములో జ్ఞానమున్నప్పుడు అది మనుషులకు తెలియకుండా పోవును కదా?**

**జవాబు :-** బయట ప్రపంచములో గొప్ప జ్ఞానులుగా యున్నవారు, గురువులుగా యున్నవారు, స్వామీజీలుగా చెలామణి అగువారు, మత పెద్దలు మొదలయిన వారికి దైవగ్రంథములోని జ్ఞానమునకు ఏమాత్రము సంబంధము లేదు. సమాజములో జ్ఞానులనిపించుకొన్న వారికి ఉన్న జ్ఞానము వేరు, దైవ గ్రంథములలో ఉండే జ్ఞానము వేరు. **బయట ఎంత గొప్ప జ్ఞానులయినా దైవగ్రంథములలో మొదటినుండి జ్ఞానము తెలియ వలసిందే.** నేడు ముఖ్యమైన మూడు మతముల వారు మా మత గ్రంథములని చెప్పుకొను **భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్** అను మూడు గ్రంథములలోని జ్ఞానమును తెలియలేక దేవుడు చెప్పినది ఒకటయితే మనుషులు చెప్పునది మరొకటిగా చెప్పుకొనుచున్నారు. దీనిప్రకారము **భగవద్గీత** హిందువులకు సరిగా తెలియకుండా పోయినది. అట్లే క్రైస్థవులకు **బైబిలు**, ముస్లీమ్‌లకు **ఖుర్ఆన్** గ్రంథము సరిగా అర్థము కాలేదని చెప్పవచ్చును. ఏ గ్రంథములో ఎట్లు మనిషి దైవ సందేశమును అర్థము చేసుకోలేక పొరపడి తప్పు దారి పట్టాడో ఆ విషయమును తెలియజేస్తూ మీరు అనుకొన్నది సత్యమో కాదో చూచుకొండని చెప్పడమే ఈ గ్రంథము యొక్క ఉద్దేశ్యము. అందువలన **'సత్యాసత్య విచక్షణ'** అని గ్రంథమును అంటున్నాము.

**13) ప్రశ్న :- మూడు మతములలోను తెలియవలసిన సందిగ్ధ విషయములు ఎన్నోయున్నా ఎక్కువ అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లోనూ, తక్కువ ప్రథమ దైవగ్రంథములోనూ గలవు. మొదట ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో గల ఒక శ్లోకములోని విషయమును, అందులోని సత్యా సత్యములను తెలుపవలసినదిగా కోరుచున్నాము.**

**జవాబు :-** ప్రథమ దైవగ్రంథము భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున 13వ శ్లోకము ఇలా కలదు.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।
తస్యకర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥

(పరమాత్మ)

భావము :- **"నాల్గు వర్ణములు నా చేత సృష్ఠింపబడినవి. మనుషుల గుణ కర్మములను బట్టి నాల్గు వర్ణములుగా సృష్ఠించడము జరిగినది. నాల్గ వర్ణముల వారికి కర్తనయ్యు కాకుండా అవ్యయునిగా యున్నాను."** అని శ్లోకములో చెప్పియున్నాడు. అయితే దీని వివరమును దాదాపు మూడు వందల నలభై మంది వ్రాసియున్నారు. 340 భగవద్గీతలలో రచయిత లందరూ నాలుగు వర్ణములను దానికి నాలుగు కులముల పేర్లు చెప్పడ మైనది. అందులో మొదట బ్రాహ్మణ, తర్వాత వైశ్యులు, క్షత్రియులు అని చెప్పి చివరగా మిగిలిన కులములన్నిటిని కలిపి శూద్రులు అని అన్నారు. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర అని నాలుగు రకములుగా విభజించి చెప్పారు. దేవుడు చెప్పిన శ్లోకములో ఈ నాలుగు కులముల పేర్లు ఏమాత్రము లేవు. దీనిని బట్టి మనుషులు ఈ శ్లోకములో చెప్పిన భావము తప్పని తెలియుచున్నది. దేవుని భావము వేరుగాయుండగా, మనుషుల

భావము వేరుగా యున్నట్లు కనిపించుచున్నది. దేవుని ఉద్దేశ్యము జ్ఞానము కాగా, మనుషుల ఉద్దేశ్యము అజ్ఞానముగా యున్నది. ఈ శ్లోక భావమును చదివిన చాలామందికి దేవుడు చెప్పిన భావము తెలియకుండా పోయినది. దానివలన ఈ శ్లోకములో ఏమాత్రము విచక్షణ లేని మనుషులందరూ మనుషులు చెప్పిన వివరమునే నమ్మారు. కొంతయినా విచక్షణా బుద్ధితో ఆలోచించలేకపోయారు. కొందరు మనుషులు వారి భావమును వారు వ్రాయగా, మిగతా వారందరూ దానినే ఎందుకు నమ్మాలి?

గ్రంథములో మిగతా సందర్భములలో కొన్నిచోట్ల 'దేవుడు అందరికీ సమానుడు. అందరియందు ఒకే విధముగా యున్నాడు' అని చెప్పబడి యున్నది. దైవజ్ఞానము అందరికీ సమానముగా చెప్పబడియున్నది. ఎక్కడ గానీ కులప్రసక్తిగానీ, మత ప్రసక్తిగానీ లేదు. సర్వ జీవులు సమానమని, తన జ్ఞానము అందరికీ సమానముగా యున్నదనీ ఆడ, మగ తేడా లేకుండా కుల, మత భేదము లేకుండా సర్వ జీవులయందు దేవుడు సమానముగా యున్నాడని, సర్వ జీవులకు తన జ్ఞానము సమానమని అందరూ గుణము లలో పుట్టియున్నారని, వారు నివసించు ఊరునుబట్టి ఫలానా ఊరు వారన్నట్లు, వారు నివసించు గుణములనుబట్టి ఫలానా గుణముల వారని చెప్పుచుందుము. తామస గుణ భాగములోయున్న జీవులను తామసులనీ, రాజస గుణ భాగములోయున్న జీవులను రాజసులని, సాత్త్విక గుణ భాగములోయున్న జీవులను సాత్త్వికులని అంటున్నారు.

ఈ విధముగా గుణములను బట్టి మనుషులకు పేర్లు గలవు. గ్రామముల నివాసమును బట్టి ఫలానా గ్రామస్థుడని చెప్పినట్లు, గుణముల నివాసమునుబట్టి ఫలానా గుణస్థుడను పేరు చెప్పుచున్నాము. అదే విధముగా భగవద్గీతలో దేవుడు మనిషి నివసించు గుణములనుబట్టి, సంపాదించు

కర్మలనుబట్టి, మనుషులు నాలుగు వర్ణములుగా యున్నారని చెప్పాడు. 'వర్ణము' అనుమాటకు 'రంగు' అని అర్థము గలదు. రంగు అనగా జ్ఞానము అని కూడా అర్థము గలదు. ఈ విషయ సాక్ష్యమునకు అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 2, ఆయత్ 138లో చూస్తే ఇలా కలదు చూడండి. **(2-138) "అల్లాహ్ రంగును స్వీకరించండి. అల్లాహ్ కన్నా మంచి రంగు ఎవరిది కాగలదు? మేము మాత్రము ఆయననే ఆరాధిస్తాము."** అని కలదు. దేవుని జ్ఞానమును మించిన జ్ఞానము ఎక్కడా ఎవరిదీ లేదు. అందువలన 'దేవుని జ్ఞానమును స్వీకరించండి' అని చెప్పి మేము దేవుని జ్ఞానము ప్రకారము దేవున్నే ఆరాధిస్తున్నాము అని చెప్పారు. అదే విధముగా భగవద్గీతలో 'నాలుగు రంగుల మనుషులున్నారని' చెప్పుచూ 'నాల్గు వర్ణముల మనుషులను సృష్టించాను' అని చెప్పారు. దీని అర్థము ప్రకారము మనము విచక్షణా బుద్ధితో తెలియగలిగితే 'మనుషులలో నాల్గు రకముల జ్ఞానములు కలవారున్నారని' తెలియుచున్నది. ఈ విషయమును భగవద్గీతలో మోక్ష సన్న్యాస యోగమున 19, 20, 21, 22 శ్లోకములలో చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 19. జ్ఞానం కర్మచ కర్తా చ త్రిధైవ గుణ భేదతః।
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి ॥

(గుణములు)

**భావము :-** మనుషుల శరీరములో తలయందు గుణములను వివరించుకొని చూడగలిగితే, గుణముల విధానమునంతయూ తెలియగలిగితే, గుణముల అనుబంధముగా కర్మ, కర్మ అనుబంధముగా కర్త ఉండునని తెలియగలిగితే

గుణ భేదములనుబట్టి మూడు విధములయిన జ్ఞానములు తెలియ చెప్పబడినవి.

శ్లో॥ 20. సర్వ భూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥

(సాత్త్విక జ్ఞానము)

**భావము :-** వేరువేరు రూపములుగా తయారయిన సర్వ జీవరాసులలోని ఆత్మయొక్కటే. ఆత్మ అన్ని శరీరములలో యున్నా నాశనము లేనిదని తెలుపు జ్ఞానమును సాత్త్విక జ్ఞానము అని చెప్పవచ్చును.

శ్లో॥ 21. పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్॥

(రాజస జ్ఞానము)

**భావము :-** వేరువేరు జీవరాసులందు ఆత్మ వేరువేరుగా యున్నదనీ, అట్లే వానికున్న గుణములు కూడా వేరువేరుగా యుండుననీ భావింపజేయు జ్ఞానమును రాజస జ్ఞానమని చెప్పవచ్చును

శ్లో॥ 22. యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యేసక్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్ ॥

(తామస జ్ఞానము)

**భావము :-** కారణము లేనిది, అసత్యమైనది, స్వల్పమైనది అయిన ఒక్క కార్యమే సర్వార్థ సిద్ధియనుచు దానియందే (అటువంటి పనులయందే) ఆసక్తిని కల్గించు జ్ఞానమును తామస జ్ఞానమని చెప్పవచ్చును.

ఈ విధముగా గుణములతో కూడిన మూడు రకముల జ్ఞానముల వారు, లేక మూడు రకముల వర్ణముల (రంగుల)వారు కలరని చెప్పవచ్చును. మూడు గుణముల జ్ఞానము ఉన్నట్లే, మనిషి తలలోని గుణచక్రమందు మరియొక నాల్గవ వర్ణము కూడా కలదు. గుణముల వర్ణములు మూడుకాగా, గుణములేని వర్ణము నాల్గవది కలదు. మూడు వర్ణములు ప్రకృతి జనితములుగా యుండగా, నాల్గవ వర్ణము (జ్ఞానము) దైవ సమ్మతమైనదిగా యున్నది. ఈ విధముగా గుణములు కలవి మూడు, గుణము లేనిది ఒకటి మొత్తము నాల్గు వర్ణములుండగా, మనిషి (జీవుడు) తన కర్మ ప్రకారము మూడు గుణభాగములలోనూ, కర్మరహితముగానున్న గుణరహిత యోగ భాగములోనూ నివసించుచుండును. జీవుడు నివసించు స్థలమునుబట్టి సాత్త్వికుడనో, రాజసుడనో, తామసుడనో గుణ వర్ణములను బట్టి చెప్ప వచ్చును. గుణములేని స్థలమునుబట్టి **యోగి** అని చెప్పవచ్చును. ఈ విధముగా కర్మ, గుణములు ఉన్న దానినిబట్టి మూడు విధములు, లేనిదానినిబట్టి ఒక విధముగా మొత్తము నాలుగు వర్ణములుగా చెప్పవచ్చును. ఈ నాలుగు వర్ణములనే జ్ఞానయోగములో 13వ శ్లోకమందు చెప్పియున్నారు. అక్కడ చెప్పిన విషయమును గ్రహించలేని మనుషులు నాల్గు కులములుగా మనుషులను చెప్పడము జరిగినది. అది పూర్తి తప్పని గ్రహించిన మేము వారు చెప్పిన భావము తప్పని చెప్పి ఏది సత్యమో, ఏది అసత్యమో వివరముగా మీకు ఇప్పుడు చెప్పడము జరిగినది. ఈ విషయము ఇంకా విపులముగా అర్థము కావాలంటే దృశ్యరూపముగా అర్థమగునట్లు చూప దలచాము తర్వాత పేజీ పటములో చూడండి.

తర్వాత పేజీ పటములో చూపిన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల చక్రములో గుణచక్రమును ఎదురుగా త్రిప్పి చూస్తే ప్రక్క చిత్రము

కనిపించును. గుణచక్రములో మధ్య భాగముతో సహా మొత్తము నాలుగు భాగములున్నవి. నాలుగు భాగములనే శ్లోకములో నాలుగు వర్ణములు అని చెప్పాము. ఈ నాలుగు భాగములలో మధ్య భాగము గుణ రహితమైనది. మిగతా మూడు భాగములు మూడు గుణముల భాగములని చెప్పవచ్చును. ఈ నాలుగు భాగములలో జీవుడు ఎక్కడయినా ఉండ వచ్చును. అయితే మధ్య భాగములో తప్ప మిగతా మూడు భాగములలో గత జన్మ కర్మలను అనుసరించి జీవుడు నివాసముండుట జరుగును. ఏ గుణ భాగములో జీవుడుంటే ఆ గుణము పేరుతో వానిని చెప్పవచ్చును. బయట గుణభాగములో యుంటే తామసుడు అనీ, రెండవ భాగములో యుంటే రాజసుడు అనీ, లోపలి మూడవ భాగములో యుంటే సాత్త్వికుడు అనీ, పూర్తి మధ్య భాగములో యుంటే యోగి అని చెప్పవచ్చును. ఇది వాస్తవమైన అంతర్భాగములో కనిపించకయున్న యదార్థము. ఈ నాలుగు




తల మధ్య భాగములో గల నాలుగు చక్రముల అమరిక




గుణ చక్రము

భాగముల వారిని కర్మనుబట్టి ఆయా స్థలములలో యుండు వారని చెప్పవచ్చును. అందువలన శ్లోకములో **"గుణ కర్మ విభాగశః"** అని చెప్పారు. నాల్గు స్థలములలో యుండు వారిని నాలుగు వర్ణముల వారని చెప్పగా, దానిని అర్థము చేసుకోలేని మనుషులు విచక్షణా జ్ఞానము లేనివారై, దేవుడు ఒకటి చెప్పియుంటే, మనుషులు ఇంకొకటి తలచి బయట అజ్ఞానము వలన తయారు చేసుకొనిన కులములను చేర్చి బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర అని చెప్పారు. దేవుని దృష్టిలోగానీ ఆయన భావములోగానీ కులముల ప్రసక్తే లేదు. దేవుడు చెప్పని దానిని మనిషి చెప్పుకొనుచూ, దేవుడు చెప్పిన అంతర్ముఖ జ్ఞానమును గాలికి వదలివేశారు. అందువలన దేవుడు మనిషికి చెప్పిన జ్ఞానము ఎవరికీ తెలియకుండా పోయినది. ఈ విధముగా దేవుడు తన గ్రంథములలో మనుషులకు తన ధర్మములను తెలిపినా, అవి సామాన్య మనిషి వరకు చేరలేదు. మత పెద్దలు, గురువులు, స్వాములు అయినవారు తమకు జ్ఞానము తెలుసుననీ, తాము చెప్పినట్లే నడచుకోవాలని

చెప్పడము వలన వారు తప్పుద్రోవపట్టి పోయి అందరినీ తప్పుదారి పట్టించుచున్నారు. వారి మత పెద్దలు, గురువులు చెప్పిన దానిని విని మా పెద్దలు చెప్పిన దానినే మేము వింటామని చెప్పువారు, తాము వినినది సత్యమా కాదా!యని కొద్దిమాత్రము కూడా విచక్షణ లేనివారై గ్రుడ్డిగా మనుషులు చెప్పిన మాటలను విని దేవుడు చెప్పిన సత్యమును గ్రహించకపోతే, అటువంటి వాడు నిజమైన జ్ఞానమును ఎప్పటికీ తెలుసుకోలేడు. పెద్దలు చెప్పినది వినవలసిందే. వినిన దానిని తన బుద్ధితో ఆలోచించవలసిందే. ఆలోచించిన తర్వాత సత్యాసత్యములను విడదీసి అందులో సత్యమును గ్రహించి అసత్యమును వదలివేయాలి. అట్లు చేయకపోతే ఇతరులు చెప్పిన మాటలను గ్రుడ్డిగా నమ్మితే చివరకు నీకే నష్టము కల్గుతుంది. నీకే దేవుని జ్ఞానము తెలియకుండా పోతుంది. అందువలన నీ జన్మే వృథా అవుతుంది.

**14) ప్రశ్న :- ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతలో ఒక్క శ్లోకములోనే పూర్తి దారి తప్పిపోయి, మాకు తెలిసిన విషయము సత్యమా కాదా! అను విచక్షణ లేనివారమై పోయాము. మీరు విడదీసి చెప్పడము వలన నాకు వచ్చిన సంశయము సంపూర్ణముగా తీరిపోయినది. ఒక్క శ్లోకము వద్దనే ఎంతో జ్ఞానమును కోల్పోయాము. భగవద్గీతను వ్రాసిన వారందరూ జ్ఞానము తెలిసినవారేయని నమ్ముట వలన, మేము తప్పుదారి పట్టి పోయామని, దేవుని జ్ఞానము దైవ గ్రంథములో యున్నా అది తెలియకుండా పోయినదని, ఇప్పుడు బాగా అర్థమగుచున్నది. ఇటువంటి పరిస్థితి ఒక్క హిందూ మతమునకే పరిమితి కాలేదు. మిగతా మతములలో కూడా ఇదే విధముగా ప్రజలు దేవుని జ్ఞానము వద్ద మోసపోవడము జరుగుచున్నది. గ్రంథములో ఒకచోట చెప్పిన జ్ఞానము మరొకచోట వేరు విధముగా లేక**

అజ్ఞానముగా చెప్పబడియుండును. అప్పుడు ఆ విషయము మీద కొంత అనుమానము వచ్చినా, చాలామంది ఆ విషయమును గాలికి వదలివేసి పెద్దలు చెప్పినది వినవలెనని అనుకొంటున్నారు. అక్కడే తప్పటడుగు వేసినట్లు అగుచున్నది. దేవుడు చెప్పినది ముఖ్యమా? మతము చెప్పినది ముఖ్యమా? అని ఆలోచించక మత పెద్దలు చెప్పిన మతాచారము ప్రకారము పోవడము వలన మనిషికి దేవుని జ్ఞానము తెలియకుండా పోవుచున్నది. ఇప్పుడు మాకు జ్ఞానోదయమైనది. కనుక నేను నాకు అనుమానము వచ్చిన విషయమును అడుగుదును. దయచేసి మీరు మాకు సరియైన జ్ఞానమును తెలుపమని కోరుచూ ఇప్పుడు అంతిమ దైవగ్రంథములో ఒక విషయమును అడుగుచున్నాను. నేను ఒక ముస్లీమ్ పెద్దను కలువడము జరిగినది. అతను జ్ఞానములో ఆరితేరిన వాడని పేరుగాంచినవాడు. అంతేగాక ఇస్లామ్ సమాజములో ఒక ఆధ్యాత్మిక సంస్థను ఏర్పరచి ఇస్లామ్ జ్ఞానమును బోధించువాడు. అతను బైబిలు, ఖురాన్ తరపున ఎన్నో విషయములలో డిబేట్‌లలో పాల్గొని ఇదే సత్యము అని వాదించేవాడు. అతనిని చాలామంది ఇస్లామ్‌లో గొప్పగా తెలిసినవాడని పొగడుచుందురు. అంతటి గొప్ప జ్ఞాని వద్దకు పోయి బైబిలు గ్రంథములో ఏసు ప్రభువు వారు ఎన్నో మహత్యములు చేశారు. గ్రుడ్డి వారికి చూపును ఇచ్చాడు. కుష్ఠురోగిని నయము చేశాడు. ఖుర్ఆన్ గ్రంథములో ముహమ్మద్ ప్రవక్తగారు అటువంటి మహత్యములు ఎక్కడా చేసినట్లు లేదు కదా! ఏసు ప్రవక్త మహత్యములను చేసి మనుషులను రోగములనుండి స్వస్థత పరచినప్పుడు, ముహమ్మద్ ప్రవక్తగారు ఎందుకు మహత్యములు చేయలేకపోయాడు? ఎందుకు ఇతరుల రోగములను స్వస్థత చేయలేక పోయాడు? ఈ సంశయమునకు నాకు అర్థమగులాగున వివరించి చెప్పమని సవినయముగా అడిగాను.

**అప్పుడు ఆయన ఏమాత్రము వెనుక ముందు చూడకుండా వెంటనే జవాబు చెప్పాడు. సూరా మూడులో 49వ ఆయత్‌ను చెప్పాడు. అందులో ముహమ్మద్ ప్రవక్తగారు కూడా మహత్యములు చేసి చూపించినట్లు గ్రుడ్డివారికి చూపు ఇచ్చినట్లు, కుష్టురోగికి స్వస్థత చేకూర్చినట్లు కలదని చెప్పారు. అదే ఖుర్ఆన్ గ్రంథములో ఒకచోట ప్రవక్త 'ఏ మహత్యము లేని సాధారణ వ్యక్తి' అని అతను 'జ్ఞానమును చెప్పి హెచ్చరించువాడేయని' చెప్పారు. ఇందులో ఏది నిజమంటారు? దయచేసి తెల్పమని అడుగు చున్నాను?**

**జవాబు :-** దేవుని దృష్ఠి వేరు, మనిషి దృష్ఠి వేరు. మన దృష్ఠిలో అనేక లోపములుండవచ్చును. ఎదుట ఉండునది ఒకటయితే మనకు తెలియునది మరొకటి యుండును. అజ్ఞానులు కూడా మన దృష్ఠిలో జ్ఞానులుగా కనిపించ వచ్చును. అయితే దేవుని దృష్ఠిలో జ్ఞానులు జ్ఞానులుగానే, అజ్ఞానులు అజ్ఞానులుగానే కనిపించుదురు. మనుషులు అబద్ధములు చెప్పినా మనుషులు సత్యమని నమ్మగలరు. మనుషులు చెప్పునది సత్యమా అసత్యమా యని దేవుడు తెలియగలడు. అందువలన మనుషులు సాధ్యమున్నంతవరకు దేవుని మాటలను అర్థము చేసుకొనుటకు ప్రయత్నము చేయవలెను. అయితే మనిషి దేవుని మాటలను ప్రక్కనపెట్టి మనిషి మాటనే వినుచున్నాడు. పైగా 'మా పెద్దలు చెప్పిన మాటను మేము వినవలెను' అని అంటున్నారు. వారి దృష్ఠిలో వారి పెద్దలు జ్ఞానము బాగా తెలిసినవారని అనుకొంటున్నారు. అట్లు మనుషులు పొరపడు అవకాశముందని మనుషులను హెచ్చరించుచూ అల్లాహ్ (దేవుడు) ఖుర్ఆన్ గ్రంథములోనే సూరా ఆరులో, ఆయత్ 91 యందు **(6-91) "మీకు గానీ, మీ పెద్దలకు గానీ తెలియని ఎన్నో విషయములు ఇందులో మీకు తెలుపబడ్డాయి"** అని ఉంది.

దానిప్రకారము మనుషులు ఎవరినయితే పెద్దలు, జ్ఞానులు, గురువులు, బోధకులు అని అనుకుంటున్నారో వారికి కూడా దైవజ్ఞాన విషయములు తెలియవని దేవుడు తన బోధలో తెలియజేశాడు. సూరా 17, ఆయత్ 85లో **(17-85) "ఆత్మను గురించి దేవునికే తెలుసు. దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. దేవుడు ఆత్మను గురించి, ఆత్మజ్ఞానము గురించి తన ప్రవక్తలకు కూడా చెప్పలేదు"** అని కలదు. అంతేకాక సూరా మూడు, ఆయత్ ఏడులో **(3-7) లో "దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మనుషులకు ఎవరికీ తెలియదు"** అని చెప్పియుండుట వలన మనుషులు చెప్పిన జ్ఞానమును విని అదే నిజమైన జ్ఞానము అని అనుకోవడము పెద్ద పొరపాటగును. అందువలన దేవుడు చెప్పిన జ్ఞానమును దైవగ్రంథముల నుండి చదివి, నీ బుద్ధిని ఉపయోగించి సత్యాసత్య విచక్షణతో ఆలోచించి నిర్ణయించుకొనినా, కొంతవరకు ప్రతి మనిషికి సత్యము తెలియగలదు.

ఇప్పుడు అసలు విషయమునకు వస్తాము. మీరు ఇస్లామ్‌లో గొప్ప జ్ఞాని అయిన వ్యక్తిని ముహమ్మద్ ప్రవక్తగారు తన జీవితములో ఏసుప్రభువు చూపినట్లు మహత్యమును చూపాడా! అని అడిగావు. అప్పుడు అతను సూరా మూడు, ఆయత్ 49లో చూడమన్నాడు. మనము ఇప్పుడు అదే ఆయత్‌ను తీసుకొని చూస్తాము. **(3-49) ఇంకా అతను ఇస్రాయీలు వంశీయుల వైపుకు ప్రవక్తగా పంపబడతాడు. (అప్పుడు వారిని ఉద్దేశించి ఆయన ఇలా అంటాడు) "నేను మీ వద్దకు మీ ప్రభువు దగ్గర నుంచి సూచనను తీసుకువచ్చాను. నేను మీ కోసము పక్షి ఆకారమున్న మట్టి బొమ్మను తయారు చేసి అందులో ఊదుతాను. అల్లాహ్ ఆజ్ఞతో అది పక్షి**

**అవుతుంది. ఇంకా అల్లాహ్ ఆజ్ఞతో పుట్టు గ్రుడ్డిని, కుష్ఠు రోగిని బాగు చేస్తాను. మృతులను బ్రతికిస్తాను. మీరు తినే వాటిని, మీరు మీ ఇండ్లలో నిలువ చేసిన వాటిని గురించి కూడా చెప్పుతాను. మీరు విశ్వసించే వారయితే ఇందులో మీ కొరకు గొప్ప సూచన ఉంది".**

ఈ వాక్యములో వారు చెప్పునది ముహమ్మద్ ప్రవక్తగారు కూడా దేవునివద్ద నుండి సూచన (మహత్యము)ను తీసుకొని వచ్చాను అని చెప్పాడనీ, అంతేకాక ఆయన గ్రుడ్డివానిని బాగు చేస్తాననీ, అట్లే కుష్ఠు రోగిని కూడా బాగుచేస్తానని చెప్పినట్లు ఈ వాక్యములో చూపుతున్నారు. వాక్యములో ఆ విషయములున్నది వాస్తవమే. అయితే ఇక్కడ పెద్ద పొరపాటు జరిగినది ఏమనగా! 'ఈ మాటలు ముహమ్మద్ ప్రవక్తగారు చెప్పారు' అనడము పెద్ద తప్పు. ఆ మాటలను ప్రవక్తగారు ఏమాత్రము చెప్పలేదు. ఖుర్ఆన్ గ్రంథమును జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పునప్పుడు ఏసు విషయమును మరియు ఏసు తల్లి మరియమ్మ విషయమును తెలియజేస్తూ మూడవ సూరాలో 45వ ఆయత్ నుండి 50వ ఆయత్ వరకు చెప్పిన విషయము ఇక్కడ కలదు. 45వ వాక్యమునుండి చదువుతూ వస్తే 49వ వాక్యములో ఎవరిని గురించి జిబ్రయేల్ చెప్పాడో తెలియగలదు. అందువలన మనము ఒకమారు 45వ వాక్యమునుండి చదివి చూస్తాము.

**(3-45) దైవ దూతలు "ఓ మర్యమ్! అల్లాహ్ నీకు తన వాక్కుకు సంబంధించిన శుభవార్తను వినిపిస్తున్నాడు. అతని పేరు మసీహ్ ఈసా బిన్ మరియమ్. అతడు ఇహ పరములలో గౌరవ నీయుడవుతాడు. అతను అల్లాహ్ సామీప్యమును పొందిన వారిలో ఒకడు." (46) "అతడు ఉయ్యాలలో ఉన్నప్పుడు, పెద్దవాడై**

**నప్పుడునూ ప్రజలతో మాట్లాడతాడు. ఇంకా అతడు మంచి ప్రవర్తన కలవాడై ఉంటాడు" అని అన్నప్పుడు (47) ఆమె "నా ప్రభూ! నాకు పిల్లవాడు ఎలా పుట్టుతాడు? నన్ను ఏ మనిషి తాకలేదే" అన్నది. "అలాగే జరుగుతుంది. అల్లాహ్ తాను కోరినది పుట్టిస్తాడు. ఆయన ఏదైనా పనిని చేయుటకు సంకల్పించు కొని "అయిపో" అని అంటే చాలు అది అయిపోతుంది" అని దైవదూత ద్వారా సమాధానము లభించినది. (48) "అల్లాహ్ అతనికి అక్షర జ్ఞానాన్ని, వివేకాన్ని, తౌరాతు, ఇంజీలు గ్రంథాల జ్ఞానాన్నీ నేర్పుతాడు" (అని కూడా దైవదూతలు తెలిపారు.)**

అంతేకాక ఇంకా కొంత విషయమును 49వ వాక్యములో చెప్పుచున్నాడు చూడండి. **(3-49) ఇంకా అతను ఇస్రాయీలు వంశీయుల వైపుకు ప్రవక్తగా పంపబడతాడు. (ఇస్రాయీలను ఉద్దేశించి ఆయన ఇలా చెప్పుతాడు.) నేను మీ వద్దకు మీ ప్రభువు వద్దనుండి సూచనను తీసుకవచ్చాను.** (అని చెప్పినది ఎవరు? అన్నది ప్రశ్న.) ఏ కోణమునుండి చూచినా ఇక్కడ ఏసును గురించి ఆయన తల్లికి దేవదూతలు చెప్పినట్లు కలదుగానీ ముహమ్మద్ ప్రవక్తను గురించి చెప్పినట్లు లేదు. కొద్దిగ బుద్ధియున్న వారికి కూడా ఈ విషయము అర్థమగునట్లు గలదు. అయితే ఎంతో గొప్ప బుద్ధియున్న వారు సహితము ఇది ప్రవక్త విషయము అని చెప్పుచున్నారు. అంటే వారు ఈ విషయములో పొరపడియైనా ఉండాలి, లేక సత్యము తెలిసినా ఉద్దేశ్యపూర్వకముగా అసత్యమును చెప్పుచుండాలి. నన్ను అడిగితే తెలియక పోయేంత రహస్యము ఏమీ ఈ వాక్యములో లేదు. ఇది ఏసును గురించి చెప్పినదని పైకి కనిపించు నదిగా కలదు. ఈ వాక్యములో "దేవుని ఆజ్ఞతో గ్రుడ్డి వానిని, కుష్ఠరోగిని

బాగు చేయును. మృతుని సజీవముగా లేపును" అని కలదు కదా! ఆ సూచనలు (మహత్యములు) ఏసు జీవితములో జరిగినవి గానీ, ముహమ్మద్ ప్రవక్తగారి జీవితములో జరుగలేదు.

ఖుర్ఆన్ గ్రంథములో సూరా 13, ఆయత్ 7లో ఈ విధముగా చెప్పియున్నారు చూడండి. **(13-7) "అతనిపై ప్రభువు (దేవుని) తరఫున ఏదైనా సూచన (మహిమ) ఎందుకు అవతరించలేదు." అని అవిశ్వాసులు అంటున్నారు. ఓ ప్రవక్తా! వాస్తవానికి నీవు వారిని హెచ్చరించే వాడివి మాత్రమే. ప్రతి జాతికి మార్గదర్శకుడు అంటూ ఒకడున్నాడు".** అని చెప్పబడియున్నది కదా! ఇందులో మహత్య విషయము ప్రవక్తను అడిగేవారు కొందరు కలరు. అయితే ప్రవక్తగారు వారికి జ్ఞానము చెప్పి హెచ్చరించేవాడే తప్ప ఇతర మహత్యములు చూపువాడు కాదు. ప్రతి జాతికి మార్గదర్శకుడు ఒకడున్నాడు. అట్లే నీవు ప్రజలకు జ్ఞాన మార్గ దర్శకుడివి అని చెప్పారు. ఈ వాక్యమును చూస్తే ప్రవక్తకు దేవుని సూచనలకు (మహత్యమునకు) సంబంధము లేదని మహత్యములు చేయు వాడు ప్రవక్త కాదనీ, ప్రవక్త ప్రజలకు జ్ఞాన దర్శకుడుగా యుండునని చెప్పారు.

ఇదంతా చదివిన తర్వాత ముహమ్మద్ ప్రవక్తను మహత్యములు చేయువాడని, అతనికి మహత్యములకు సంబంధముందని చెప్పడముగానీ తప్పగును. ఖుర్ఆన్‌లో అల్లాహ్ మాటను అతిక్రమించి మాట్లాడినట్లగును. మూడవ సూరాలో 49వ వాక్యమందు సూచనలు జరుగునని చెప్పినది మరియమ్మ కుమారుడైన ఏసుప్రభువును గురించేగానీ ఇతరులను గురించి కాదు. అక్కడ చెప్పినట్లే ఏసు జీవితములో "గ్రుడ్డివానిని, కుష్ఠురోగిని స్వస్థత చేయడము, మృతున్ని లేపడము జరిగినది". అటువంటి సంఘటనలు

ముహమ్మద్ జీవితములో ఒక్కటి కూడా జరుగలేదు. 3-49వ ఆయత్‌ను బుద్ధికి గల విచక్షణా శక్తితో పరిశీలించితే సత్యాసత్యము తెలియగలదు. వాక్యములోని సత్యాసత్యము తెలియుటకు 45వ వాక్యమునుండి 46, 47, 48 వాక్యములను చదివితే 49వ వాక్యము ఏసును గురించి చెప్పినదని సులభముగా తెలిసిపోవుచున్నది. దైవగ్రంథములోని జ్ఞాన వాక్యములోని సత్యము తెలియుటకు మనిషికి బుద్ధియొక్క విచక్షణా శక్తి తప్పక అవసరము. ప్రపంచ విషయములో ఎంతో విచక్షణను ఉపయోగించు వారు దేవుని జ్ఞాన వాక్యములందు గ్రుడ్డిగా మాట్లాడడము చోద్యముగా యున్నది.

**15) ప్రశ్న :- ఈ మధ్య కాలములో ముస్లీమ్‌లలో ప్రత్యేకముగా యున్న ఒక వర్గము వారు నాతో కలువడము జరిగినది. ముస్లీమ్‌లలో 74 తెగలు గలవు. అందులో ఒక తెగవారు కలిశారు. వారు ఆఫ్ఘనిస్థాన్‌లో తాలిబన్లవలె వారి వేషధారణ యున్నది. మేమే నిజమైన ముస్లీమ్‌లము అని మిగతావారు సరియైన ముస్లీమ్‌లు కాదని చెప్పుచుందురు. మనము నివసించు ప్రాంతములో అటువంటి వారు బహుకొద్ది మంది మాత్రమే కలరు. వారు మీరు వ్రాసిన "అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు" అను గ్రంథములో ఒక పేజీని చూపి అందులో "ప్రవక్తగారు ఇంకా కొంత కాలము బ్రతికి యుంటే ఖుర్‌ఆన్ జ్ఞానము ఇంకా కొంత తెలిసియుండేది. ఆయన వ్యాధిగ్రస్థుడై పదకొండు రోజులకే చనిపోవడము వలన మనకు తెలియ వలసిన జ్ఞానము తెలియకుండాపోయినది. ఆయన బ్రతికియుంటే మరికొంత జ్ఞానము తెలిసి యుండేదేమో" అని వ్రాశారు. అలా వ్రాయడము తప్పని ప్రవక్తగారు బ్రతికియున్నప్పుడే ఖురాన్ జ్ఞానము సంపూర్ణముగా చెప్పబడినదని వారన్నారు. దానికి నేను బదులుగా మాట్లాడుచూ ప్రవక్తగారు చనిపోవు విషయము ఇటు ప్రజలకుగానీ అటు జిబ్రయేల్‌కు గానీ తెలియదు.**

**జీవిత చరిత్రను చూస్తే ఖుర్ఆన్ జ్ఞానము అయిపోయిందని ప్రవక్తగారు చెప్పినట్లు ఎక్కడా లేదు. జిబ్రయేల్ కూడా తాను చెప్పు బోధ అయి పోయిందని ఎక్కడా చెప్పలేదు. అటువంటప్పుడు ఖురాన్ జ్ఞానము సంపూర్ణముగా చెప్పబడింది యని ప్రవక్త చెప్పకున్నా చెప్పాడని చెప్పడ మేమిటని అడిగాను. అయినా వారు వారిమాటనే గట్టిగా చెప్పుచున్నారు. ఈ విషయమును గురించి సత్యాసత్యము ఏమిటో తెలుపమని సవినయముగా అడుగుచున్నాను?**

**జవాబు :-** ప్రవక్తగారి వలన ప్రపంచమునకు ఖుర్ఆన్ గ్రంథ జ్ఞానము లభించినది. ఆకాశమునుండి దిగివచ్చిన జిబ్రయేల్ జ్ఞానమును బోధించినా, దానిని వినిన ప్రవక్త వచ్చి ప్రజలకు తెలుపడము వలన దైవజ్ఞానము ప్రజలకు తెలిసినది. సూర్యుడు ఆకాశమునుండి దిగివచ్చి తనకు తెలిసిన జ్ఞానమును జిబ్రయేల్ అను పేరుతో చెప్పాడు. తర్వాత ప్రవక్త ద్వారా అది బయట ప్రపంచమునకు తెలిసినది. జిబ్రయేల్ (సూర్యగ్రహము) ఆకాశము నుండి తనకు అవకాశము వచ్చినప్పుడంతా దిగివచ్చి కృతయుగములో మనువుకు చెప్పిన జ్ఞానమునే చెప్పుచుండెను. ముహమ్మద్ ప్రవక్తగారికి చదువు రాదు గనుక దైవజ్ఞానమునంతటిని ఒక్కమారు చెప్పలేదు. నెలకొక మారో, రెండు నెలలకొకమారో, మూడు నెలలకొకమారో వచ్చి ఒకటి లేక రెండు వాక్యములను చెప్పిపోవుచుండెను. ఈ విధముగా 23 సంవత్సరములు జిబ్రయేల్ తనకు తెలిసిన జ్ఞానమును చెప్పుచుండెను. జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమును విన్న తర్వాత అదే జ్ఞానమునే అదే రోజే ఇంటివద్ద తన సహచరులకు ప్రవక్తగారు చెప్పేవారు. ఇంటివద్ద విను తన సహచరులు కూడా చదువురానివారై యుండిరి. వారిలో ఒక్కరు చదువు వచ్చిన వాడున్నా అతను ప్రతి రోజు ప్రవక్త దగ్గర కలువక పోవడము

వలన జిబ్రయేల్ ద్వారా వచ్చిన జ్ఞానమును వచ్చినట్లు వినలేదు. ఒకవేళ సమయానికి అక్కడేయుండి ప్రవక్తగారు తెచ్చిన జ్ఞానమును వినగలిగితే దానిని వెంటనే వ్రాసిపెట్టెడివాడు. చదువు వచ్చువారు అప్పుడప్పుడు వచ్చుట వలన వారున్నప్పుడు చెప్పిన వాక్యములు నేరుగా వ్రాయబడేవి. ఈ విధముగా ప్రవక్తగారు చెప్పినప్పుడే ఖుర్‌ఆన్ గ్రంథము కొంత వ్రాయబడినది. మిగతాదంతా విని జ్ఞాపకము పెట్టుకొన్నదేయని చెప్పుచున్నాము. **(గమనిక :- ఇక్కడ ఖుర్‌ఆన్ విషయము నాకు నాలో కల్గిన ఊహ ప్రకారము వ్రాయుచున్నాము. నా మీద విశ్వాసమున్నవారు దీనిని నమ్మవచ్చును. విశ్వాసము లేనివారు నమ్మకుండా వదలివేయ వచ్చును. అంతేగానీ నేను చెప్పునదే నమ్మమని నేను చెప్పడము లేదు. అట్లని నేను చెప్పునది సత్యమని చెప్పను. అట్లే అసత్యమని కూడా చెప్పను.)**

ఈ విధముగా అప్పుడప్పుడు జిబ్రయేల్ వచ్చి ప్రవక్తగారికి చెప్పిపోగా దానినే తన అనుచరులకు ప్రవక్తగారు చెప్పెడివాడు. జిబ్రయేల్ చెప్పిన బోధయే ఖుర్‌ఆన్ జ్ఞానము. జిబ్రయేల్ వచ్చేది ఎప్పుడని ఎవరికీ తెలియదు. ఆయన పది రోజుల నుండి వంద రోజుల లోపల ఎప్పుడయినా వచ్చి పోయెడివాడు. వంద దినములు మించి ఎప్పుడూ ఆలస్యము చేయలేదు. ముహమ్మద్ ప్రవక్తగారు చనిపోయిన రోజుకు 82 రోజుల ముందు జిబ్రయేల్ వచ్చిపోయాడని ప్రవక్తగారి జీవిత చరిత్రలో వ్రాసి యున్నది. ప్రవక్తగారు ఆరోగ్యముగా ఉండేవారు. ఒకరోజు స్మశానములో సమాధులలో యున్నవారికి మంచి చేకూరాలని ప్రవక్తగారు అక్కడికిపోయి రాత్రి రెండు నుండి మూడు గంటల మధ్య నమాజ్ చేయడము జరిగినది. ఆ దినము స్మశానము నుండి ఇంటికి వచ్చు సమయములో వచ్చిన

కడుపునొప్పి  దాదాపు పదకొండు రోజులు ఆయనను బాధించడము, ఆ బాధ వలననే ఆయన చనిపోవడము జరిగినది.  అది ఎవరూ ఊహించని ఘటన.  ఆయన ఇంకా కొన్ని సంవత్సరములు బ్రతికియుంటే  కనీసము ఇంకా మూడు సంవత్సరములయినా జ్ఞానము లభించి యుండేది.  ప్రవక్త గారు చనిపోయిన విషయము జిబ్రయేల్ భూమిమీదకు వచ్చిన తర్వాత ఆయనకు తెలిసినది.  ప్రవక్తగారు కూడా ఆరోగ్యముగా ఉండుట వలన అంత తొందరగా చనిపోతాడని ఆయన కూడా ఊహించి యుండడు. ప్రవక్తగారు చనిపోవడము వలన వచ్చే జ్ఞానము మధ్యలో ఆగిపోయినట్లయి నది.  మధ్యలో ఎటు కాకుండా నిలిచిపోయిన జ్ఞానము నా ఊహ ప్రకారము 25 సంవత్సరములు అయినా చెప్పబడేది.

అదే విషయమునే నేను **“అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు”** అనే గ్రంథములో వ్రాయడము జరిగినది.  దానిని చూచిన కొందరు  తాము పెద్దలము అనిపించుకొనుటకు  కొంతయినా మాట్లాడవలెనను ఉద్దేశ్యముతో మేము చెప్పునది తప్పని  ఖుర్‌ఆన్ గ్రంథము ప్రవక్తగారు బ్రతికియున్నప్పుడే సంపూర్ణము చేయబడినదియని ప్రవక్తగారే స్వయముగా చెప్పారని అంటున్నారు.  వారు చెప్పేది ఆధారము లేనిమాట అయినా  వారిదే సత్యము అన్నట్లు చెప్పుచున్నారు.  నేను చెప్పిన దానిలో ప్రవక్తగారు బ్రతికియుంటే  ఇంకా కొంత జ్ఞానము వచ్చునేమోయని ఆశతో చెప్పాము తప్ప  అందులో వచ్చే నష్టము గానీ, లాభముగానీ ఏమీ లేదు. వారు చెప్పినట్లు ఖుర్‌ఆన్ ప్రవక్తగారు బ్రతికియున్నప్పుడే అయిపోయి ఉంటే  ఆ విషయమును ఖుర్‌ఆన్ గ్రంథములో వ్రాసియుండే వారు. గ్రంథములో 114 సూరాలు 6236 ఆయత్‌లు ఉన్నాయి.  అందులో 114వ చివరి సూరాయందు ఆ విషయమును వ్రాసియుండే వారు.  లేకపోతే

ఏదో ఒక సూరా చివరిలో అయినా వ్రాసియుండేవారు. అలా ఎక్కడగానీ వ్రాయనిదే అయిపోయిందని కొందరనడము ఆశ్చర్యము.

ప్రవక్తగారు ఎక్కడగానీ ఖుర్ఆన్ గ్రంథము అయిపోయిందని చెప్పలేదు కదా! అటువంటప్పుడు మీరు ఎలా ఆ మాటను చెప్పుచున్నారని అడుగగా! దానికి సమాధానముగా ఐదవ సూరాలో, మూడవ ఆయత్‌నందు ఖురాన్ గ్రంథము అంతా చెప్పాననీ, ఇంతటితో అయిపోయిందని చెప్పినట్లున్నదని చెప్పారు. వారు 5-3 లో యుందని చెప్పడములో ఏదో వారికి తెలియనితనమున్నదనీ, వారు విచక్షణ లేకుండా మాట్లాడుచున్నారని అర్థమయినది. అప్పుడు తిరిగి నేను ప్రశ్నించడము జరిగినది. ఖుర్ఆన్ గ్రంథము పూర్తి అయిపోయివుంటే గ్రంథము చివరిలో ఇంతటితో గ్రంథము అయిపోయిందని వ్రాయుట సహజముగా జరుగును. అలాంటిది ఎటు కాకుండా మధ్యలో ఐదవ సూరాలో మూడవ ఆయత్‌నందు అయిపోయిందని చెప్పడము జరుగదు కదా! అని అడిగాము. దానికి వారు అది చెప్పే వారి ఇష్టము ఎక్కడయినా అయిపోయిందని చెప్పవచ్చును అని అన్నారు. ఆ మాటతో వీరి తలలో మెదడు ఉందో లేదో అనిపించినది. ఒకవేళ మెదడు యున్నా అందులో బుద్ధి యుండదని అనుకున్నాను. ఒకవేళ బుద్ధి యున్నా అది చాలా మందముగా ఉండుననీ, ఒకవేళ బుద్ధి మందమయినా దానికి విచక్షణ అనునది కొద్దిగా కూడా లేదని అర్థమయినది. వారు మాట్లాడునది పూర్తి తప్పు. అయినా తమదే సత్యమనీ, ఇతరులది అసత్యమనీ వారు అనుకొంటుండడము వలన, వారిలో సత్యమేది అను ఆలోచించు బుద్ధి విచక్షణ ఏమాత్రము లేని దానివలన వారు సత్యమును గుర్తించలేదనీ, వారికి ఏది తోచితే అదే నిజమని నమ్మునట్లు దేవుడే తయారు చేశాడనీ, అలా తయారు చేసి వారిని అపమార్గములో పంపుదును, వారికి ఎప్పటికీ

సరైన మార్గము దొరకకుండా చేస్తానని ప్రథమ మరియు అంతిమ దైవ గ్రంథములలో చెప్పినట్లు ప్రత్యక్షముగా నాకు కనిపించినదని అనుకొన్నాను.

వారు మందబుద్ధి కలవారనుటకు నిదర్శనము ఖుర్ఆన్ గ్రంథము సంపూర్ణమైనదని ముహమ్మద్ ప్రవక్త ఆ విషయము సూరా 5, ఆయత్ 3 లో చెప్పాడని అనడమేనని చెప్పవచ్చును. అంతేకాక వారు చెప్పిన (5-3) లో ఆహారమునకు సంబంధించిన విషయము గలదు. ఆ ఆయత్‌లో మనిషి తిను ఆహారము యొక్క నియమములను అల్లాహ్ చెప్పినట్లు కలదు. ఫలానా ఆహారము మనిషి తినవచ్చును, ఫలానా ఆహారము తినకూడదనీ, ఆహార నియమములను ధర్మసమ్మతము చేసి చెప్పినట్లు కలదు. అల్లాహ్ కొన్ని అనారోగ్యమును కల్గించు ఆహారములను చెప్పి వాటిని తినకూడదనీ, ఒకవేళ వాటిని తింటే ధర్మవిరుద్ధమైన పాపము వచ్చునని చెప్పాడు. ఆ మాట చెప్పిన తర్వాత ఒకవేళ ఎక్కడా ఆహారము దొరకనప్పుడు ఆకలి తీరుటకు ఏ దారి లేనప్పుడు నిషేధిత ఆహారమును తినినా ఫరవాలేదు దేవుడు క్షమిస్తాడని చెప్పారు. ఇప్పుడు 5-3 వాక్యములో ఏమి వ్రాసి యున్నారో అంతిమ దైవ గ్రంథములోని ఆ వాక్యమును ఇప్పుడు ఇక్కడ చెప్పుకొందాము.

**(5-3) "తమంతట తాము చనిపోయిన పశువ్రులు, పక్షులు, రక్తము, పందిమాంసము, దేవతల పేరుతో కోయబడిన పశు పక్షులు, ఊపిరాడక లేదా దెబ్బతిని, లేదా ఎత్తు ప్రదేశము నుండి క్రింద పడి చనిపోయిన జంతువ్రులు తినుటకు మీకు నిషేధింప బడ్డాయి. సజీవంగా ఉండగానే మీరు అల్లాహ్ (దేవ్రుని) పేరుతో కోసినవి తప్ప కుమ్మడము వలన, కౄర మృగము దాడిలో మృతి చెందిన పశువ్రులు కూడా నిషేధింపబడ్డాయి. ఇంకా విగ్రహాల**

**ముందు, ఇతర దేవతల చిహ్నాల ముందు బలి ఇవ్వబడిన పశువులు కూడా నిషేధింపబడినాయి. పాచికల ద్వారా జాతకము తెలుసుకోవడము కూడా నిషేధింపబడినది. ఇవన్నీ పాప కార్యములు, వాటిని మానేయండి".**

**సత్య తిరస్కారులు, అవిశ్వాసులు మీ ధర్మము గురించి ఇప్పుడు పూర్తిగా ఆశలు వదలుకున్నారు. కనుక మీరు వారికి ఏమాత్రము భయపడకండి, నాకే భయపడండి. నేనీ రోజు మీ కోసము మీ ధర్మాన్ని (సమగ్ర జీవన వ్యవస్థగా) పరిపూర్ణము చేశాను. మీ కోసము నా అనుగ్రహాన్ని పూర్తిగా నెరవేర్చాను. మీ శ్రేయస్సు కొరకు ఇస్లామ్‌ను మీ జీవన ధర్మముగా ఆమోదించాను. (కనుక ఇప్పటినుండి నిషేధితాల జోలికి పోకండి.) అయితే తీవ్రమైన ఆకలితో ఉండి మరో ఆహారము లేనప్పుడు నిషేధిత ఆహారములో దేన్నయినా తినవచ్చును. అలా తినినా ఫరవాలేదు. దేవుడు క్షమిస్తాడు. దేవుడు క్షమించేవాడు, కరుణించేవాడు.**

(ఈ వివరము **"ఖుర్ఆన్ భావామృతము"** అను గ్రంథము నుండి సేకరించి వ్రాయబడినది.)

ఖుర్ఆన్ గ్రంథము నేడు దాదాపు ఏడు లేక ఎనిమిది తెలుగు అనువాద గ్రంథములుగా తయారయినది. నేను ఒక హిందువునైయుండి ఖుర్ఆన్ గ్రంథములోని కొన్ని ఆయత్‌లకు వివరములు సరిగా లేనందున రెండవందల వాక్యములకు వివరమును వ్రాసి **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు"** అని పేరు పెట్టడమైనది. ఆ గ్రంథమును చదివిన

హిందువులు, ముస్లీమ్‌లు చాలా సంతోషమును వెలిబుచ్చారు. ఏ మతములో అయినా దేవుడు చెప్పిన వాక్యములను తప్పుగా అర్థము చేసుకొన్నప్పుడు, అక్కడ వారి భావము మంచిది కాదని తెలుపుచూ దానికి సరియైన వివరమును తెలుపుచుందుము. ఈ విధముగా మూడు మతములు నాకు సమానమే. మూడు మత గ్రంథముల యెడల నాకు సమాన గౌరవ భావమున్నది. దేవుడు ఒక్కడే అయినప్పుడు దైవ గ్రంథములు మూడు అయినా మూడిటి జ్ఞానము ఒక్కటే. మూడిటి జ్ఞానములో దేవుడు ఒక్కడే. అందువలన మూడు గ్రంథములయందు నా జోక్యము ఉండును.

ఇప్పుడు (5-3) వాక్యములో ఖుర్‌ఆన్ జ్ఞానము అంత అయి పోయింది సంపూర్ణముగా చెప్పానని ప్రవక్తగారు చెప్పారు అని మేము ఇస్లామ్ పెద్దలమనువారు చెప్పుచున్నారు. వారు అంతేకాక మేమే నిజమైన ముస్లీమ్‌లము, మిగతా వారందరూ సరైన ముస్లీమ్‌లు కాదనీ, వారందరూ కాఫీర్లని (అవిశ్వాసులని) అంటున్నారు. వాళ్ళువాళ్ళు ఏమనుకున్నా ఫరవాలేదు గానీ, దేవుని వాక్యమును తప్పుగా వివరించడము మంచిది కాదు కదా! దేవుని మార్గమును తప్పుగా చూపించినట్లగును. (5-3) వాక్యములో యున్నది ఒక విషయము కాగా వారు చెప్పునది మరొక విషయముగా యున్నది. ఆ వాక్యములో చెప్పినది మనుషుల ఆహారము గురించి ముఖ్యముగా యున్నది. వాక్యమంతా 95 శాతము ఆహారమును గురించి చెప్పి ఒకే ఒక వాక్యము అదృష్టమును పరీక్షించుకొను పని ఏదయినా అధర్మమేయని చెప్పాడు. తిండిని గురించి 95 శాతము, జూదమును గురించి ఐదు (5) శాతము చెప్పి మీకు సంబంధించిన ధర్మమును సంపూర్ణముగా చెప్పాను అన్నాడు. మీ ధర్మమును అనగా మనిషి జీవితములోని తిండి మరియు అదృష్టమును పరీక్షించుకొనుట ఈ

రెండు విషయముల గురించి సంపూర్ణముగా తెలియజేశాను అని చెప్పాడు. అంతేకాక అవిశ్వాసులు నా మాట వినరు వారికి మీరు భయపడవద్దండి. నాకే భయపడి నేను చెప్పినట్లు వినండియని కూడా చెప్పాడు. చివరిగా మరియొక మాట కూడా చెప్పాడు. ఆహార నియమమును గురించి ఎక్కువగా 95 శాతము చెప్పియుండుట వలన తన ప్రజల మీద ప్రేమతో, ఎక్కడయినా పూర్తి ఆకలిగొన్నప్పుడు, తినే దానికి ఏమీ దొరకనప్పుడు, నిషేధిత ఆహారమును దేనిని తినినా ఫరవాలేదు. అది ఉద్దేశ్య పూర్వకముగా చేసింది కాదు విధిలేక (మార్గము లేక) తిన్న దానివలన దేవుడు క్షమిస్తాడని చెప్పియున్నది. బుద్ధి పెట్టి చదివేవారికి ఎవరికయినా ముఖ్యముగా ఆహారము యొక్క ధర్మమే ఇందులో చెప్పియున్నట్లు కలదు. 'ఆహార ధర్మమును సంపూర్ణముగా చెప్పాను' అని చెప్పాడుగానీ, ఖుర్‌ఆన్ జ్ఞానము సంపూర్ణముగా చెప్పాను, దీని తర్వాత ఏమీ లేదని చెప్పలేదు. ఒకవేళ ఖుర్‌ఆన్ ధర్మము సంపూర్ణము అయివుంటే ఖుర్‌ఆన్ చివరిలో చెప్పి యుండేవారు. అలా ఖుర్‌ఆన్ గ్రంథములో గ్రంథము అంతమయినదని ఎక్కడా చెప్పలేదు. ముహమ్మద్ ప్రవక్తగారున్నంత వరకు ఖుర్‌ఆన్ గ్రంథము పూర్తి కాలేదు. ప్రవక్తగారికి జ్ఞానమును అందించు జిబ్రయేల్‌గానీ, జ్ఞానమును అందుకొనిన ప్రవక్తగానీ ఎక్కడా తమ బోధలు పూర్తిగా అయిపోయాయని చెప్పలేదు.

ఒకవేళ జిబ్రయేల్ చెప్పు బోధలు సంపూర్ణమయివుంటే ఆ విషయమును గ్రంథము చివరిలో తప్పక చెప్పి యుండేవారు. ఖుర్‌ఆన్ గ్రంథము 114 సూరాలతో యున్నా జ్ఞానము అయిపోయినట్లు ఎక్కడా చెప్పలేదు. చెప్పితే గ్రంథము చివరిలోనే చెప్పాలి. అట్లు ఎక్కడా వ్రాయలేదు. రెండు నుండి మూడు గంటల వరకు ఆడు సినిమాకు 'శుభము' అను

ముగింపు చివరిలో ఉంటుంది. సినిమా మధ్యలో ముగింపు ఉందనినా శుభము అని వేసినా దాని తర్వాత సినిమా వేయకూడదు. ముగింపు తర్వాత సినిమా ఎలా ఉండదో అలాగే ఐదవ సూరాలో మూడవ వాక్యము వద్దనే ముగింపు ఉంటే గ్రంథము అక్కడే ఆగిపోవలసి యుంటుంది. అట్లు కాకుండా గ్రంథము ఐదవ సూరాతో ఆగకుండా 114 సూరాల వరకు సాగిందియంటే గ్రంథము అక్కడితో అయిపోలేదని అర్థము. ఒక్క అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్ ఒక్కటే కాదు, ద్వితీయ దైవగ్రంథమునకు కూడా ముగింపు లేదు. సువార్తల జ్ఞానము చెప్పిన ఏసు కూడా ఇంతటితో జ్ఞానము సంపూర్ణమైనదని చెప్పలేదు. నా తర్వాత వచ్చే ఆదరణకర్త మీకు నేను చెప్పక వదలివేసిన విషయములు కూడా చెప్పునని చెప్పాడు. దీని ప్రకారము బైబిలు అను చెప్పబడు ద్వితీయ దైవ గ్రంథమునకు కూడా ముగింపులేదు.

ఏ విషయమునకైనా, అట్లే ఏ కథకైనా ఒక ముగింపు ఉంటుంది. భజన ముగింపులో 'గోవిందా' అంటున్నాము. పూజ ముగింపులో మంగళ హారతితో మంగళము పలుకుచున్నాము. బోధల చివరిలో 'ఓం తత్సత్' అంటున్నాము. ఈ విధముగా ప్రతి దానికి ముగింపు కలదు, అయితే జ్ఞానమునకు ముగింపు లేదు. అందువలన దైవ జ్ఞానమును సముద్రముతో పోల్చుచున్నారు. సముద్రమునకు ఎలా ముగింపు లేదో అలాగే జ్ఞానమునకు ముగింపు లేదు. అందువలన ఇంతటితో జ్ఞానము సమాప్తము అని హద్దును ఏర్పరచి చెప్పలేదు. దేవునికి హద్దు లేదు. అందువలన దేవుని జ్ఞానమునకు కూడా హద్దు లేదుయని చెప్పవచ్చును. ఒకవేళ జ్ఞానమునకు హద్దుయుంటే హద్దు వరకు నేను జ్ఞానమును తెలుసుకొన్నాను ఇక ఏమీ మిగిలి లేదు అని మనిషి చెప్పేవాడు. అటువంటి అవకాశము దేవుడు మనిషికి ఇవ్వలేదు.

దేవుడు హద్దులేనివాడే అందువలన దేవుని జ్ఞానమునకు కూడా హద్దు లేదని చెప్పవచ్చును. దేవుడు చెప్పిన కొన్ని మాటలనే మనిషి సరిగా గ్రహించుకోలేకున్నాడు. పూర్తి జ్ఞానమును తెలియుటకు సాధ్యమగునా! సాధ్యము కాదనియే చెప్పవచ్చును.

దైవ గ్రంథములోని వాక్యములన్నియు మనిషి జ్ఞానము తెలియుటకే దేవుడు చెప్పియున్నా, మనిషి మాత్రము తన బుద్ధిని వాక్యముల మీద పెట్టి చూడకుండా ఏమాత్రము విచక్షణ లేనివాడై, సత్యమును తెలియాలను ధ్యాస లేకుండా, తనకు ఎలా తోచితే అదే జ్ఞానమనుకొని, తనవారు తమ పెద్దలను వారు ఎలా చెప్పితే అదే జ్ఞానమనుకొను వారు ఎప్పటికీ దైవ గ్రంథములోని సత్యమును తెలియలేరు. ఎవరయినా దైవగ్రంథముల యెడల శ్రద్ధగలిగి బుద్ధియొక్క విచక్షణా జ్ఞానము చేత కళ్ళు తెరచి చూడగలిగితే వాక్యములోని సత్యము కొద్దికొద్దిగా తెలియగలదు. మనిషి ఎక్కడయినా పొరపడి జ్ఞానవాక్యమును తప్పుగా అర్థము చేసుకొంటే మేము జోక్యము చేసుకొని మా అనుభవము కొలది వివరించి చెప్పి ఇది తప్పు, ఇది ఒప్పు అని చెప్పినా దానిని అర్థము చేసుకోలేక మా దారియే సరియైన దారి అనువారు గలరు. ప్రతి దానికి శాస్త్రమును అనుసరించి, శాస్త్ర ప్రమాణమును అనుసరించి మనకు అర్థమయినది తప్పో, ఒప్పో లెక్కవేసి చూచుకోవచ్చును. అయితే అలా ఎవరూ చూచుకోకుండా తనకు తెలిసినదే సత్యము అనుకొంటున్నారు. ఒక సంవత్సరము జ్ఞానములోనికి వచ్చిన వారు కూడా జ్ఞానములో యాభై (50) సంవత్సరముల అనుభవమున్న వ్యక్తిని కూడా ధిక్కరించి మాట్లాడుచూ వారు ఎంతో అనుభవముతో చెప్పు మాటలను కూడా లెక్కచేయడము లేదు. అందువలన నేడు భూమిమీద అధర్మములు పెరిగి పోయాయనియే చెప్పవచ్చును. అధర్మములు పెరిగి పోయి

దైవగ్రంథముల జ్ఞానము తప్పుగా అర్థమగుచున్న ఈ కాలములో ధర్మములను తెలిపి మనుషులను జ్ఞానవంతులుగా చేయుటకు దేవుడు అవతరించవలసిన సమయము ఆసన్నమైనదనియే చెప్పవచ్చును.

**16) ప్రశ్న :- దైవగ్రంథములో కర్మను కాల్చి లేకుండా చేయు జ్ఞానమును చెప్పాడా? లేక కర్మకు సంబంధించిన ప్రపంచ విషయములను చెప్పాడా? మూడు దైవగ్రంథములలో ప్రపంచ విషయము లుండవలెనా? దేవుని విషయములుండవలెనా? నేను ఒక దైవ గ్రంథములో భార్యాభర్తలు కాపురము చేయు విషయమును, ఆహార పాణీయములలో నిషేధింపబడిన ఆహారమును, ఆస్తులు పంచుకొను విషయము వ్రాసి, దానిని కూడా ధర్మము అని చెప్పియున్నారు. ఇవి ప్రపంచ విషయములు అవుతాయి కదా! వాటిని గురించి చెప్పవలసిన అవసరము దేవునికి ఏముంది? ఎందుకు అలా చెప్పారు? వాటి వలన ఆధ్యాత్మికములో కొద్దిపాటి లాభమయినా కలదా?**

**జవాబు :-** దేవుడు చెప్పిన మూడు విధానముల ప్రకారము చెప్పబడినవి మూడు దైవగ్రంథములు. మూడు దైవగ్రంథములు మొదట బోధరూపములో వచ్చినవి. బోధరూపములో వచ్చినవే గ్రంథరూపములో వ్రాయబడినవి. మొదట బోధగా వచ్చినపుడు అందులో దేవుడు చెప్పిన భావమే యుండేది. తర్వాత దానిని విన్నవారికి కొంత భావము వేరుగా అర్థమగుట వలన వారు ఇతరులతో చెప్పినప్పుడు ఖచ్చితముగా దేవుని భావమును వెలిబుచ్చ లేకపోయారు. దేవుడు చెప్పిన బోధలో నూరు (100) శాతము జ్ఞానము ఉండగా, మనుషులు విన్నప్పుడు కనీసము పదిశాతము వేరుగా అర్థమయి వుండును. దేవుడు చెప్పినది వినినా మనిషికున్న గుణ భావముల వలన దేవుడు చెప్పినది చెప్పినట్లు అర్థముకాక కొంత ప్రక్క భావము పట్టి పోవడము వలన విన్న మనిషిలోనికి 90 శాతము జ్ఞానము ఎక్కియుండును. విన్నవాడు

ఇంకొకనితో చెప్పి తాను వినిన బోధను వ్రాయించుట వలన అక్కడ కూడా కొంత జ్ఞానమును నష్టపోవుచున్నాము. రెండవ వానినుండి మూడవ వాడు విన్నప్పుడు రెండవ వాడు తనకు తెలిసిన 90 శాతము జ్ఞానమును చెప్పగా వినిన మూడవ వానికి చెప్పిన 90 శాతములో పది శాతము తగ్గి అర్థమగుట వలన మూడవ వానికి 80 శాతము మాత్రము అర్థమయి తనకు అర్థమయిన 80 శాతము జ్ఞానమునే గ్రంథ రూపముగా వ్రాయడము జరుగుచున్నది.

ఇది అక్షరాల భగవద్గీత విషయములో జరిగినది. కృష్ణుడు యుద్ధ రంగములో యుద్ధము ప్రారంభము కాకముందు అర్జునునకు కృష్ణుడు జ్ఞానమును బోధించాడు. కృష్ణుడు అప్పుడు మొదటివాడుగా యుండి జ్ఞానమును బోధించగా, అర్జునుడు రెండవవాడుగా యుండి విన్నాడు. విన్నప్పుడే కొన్ని విషయములు అర్థముకాక తిరిగి ప్రశ్నించాడు. అప్పుడు వెంటనే కృష్ణుడు జవాబు చెప్పాడు. కొన్ని సంశయములు కల్గినా వాటిని ప్రశ్నించలేదు. తానే తన నిర్ణయము ప్రకారము జవాబును నిర్ణయించు కొన్నాడు. ఈ విధముగా విన్న అర్జునుడు కృష్ణుడు చెప్పిన జ్ఞానమును పది శాతమును కోల్పోయి 90 శాతమును మాత్రము అర్థము చేసుకోగలి గాడు. పదిశాతము నష్టపోయిన అర్జునుడు తాను తెలుసుకొన్న 90 శాతము జ్ఞానమును వ్యాసునివద్దకు పోయి చెప్పడము జరిగినది. మూడవ వాడయిన వ్యాసుడు అర్జునుడు చెప్పిన 90 శాతము జ్ఞానమును వినినప్పటికీ అందులో ఐదు శాతము తప్ప మిగతా 85 శాతము జ్ఞానమును గ్రహించాడు. వ్యాసుడు తాను గ్రహించిన 85 శాతము జ్ఞానమును భగవద్గీత గ్రంథ రూపములో వ్రాశాడు. తర్వాత భగవద్గీతలోనికి 15 శాతము అజ్ఞానము వచ్చి చేరినది. ఇలా భగవద్గీత తయారయినప్పటికీ అందులో 85 శాతము

జ్ఞానము 15 శాతము అజ్ఞానముతో యున్నదని చెప్పవచ్చును. ఈ విధముగా మొదట 100 శాతము జ్ఞానముగల బోధ గ్రంథరూపము అయ్యేటప్పటికి 85 శాతము జ్ఞానము అందులో మిగిలినది. అట్లే 15 శాతము అజ్ఞానము చోటు చేసుకొన్నది.

ప్రథమ దైవగ్రంథము నేడు భగవద్గీతయను గ్రంథరూపముగా యున్నా, దానిని స్వయముగా వ్యాసుడు మూడవ వానిగా విని వ్రాసినా అందులో 85 శాతము జ్ఞానము మిగిలినది. ఇప్పుడు అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్ఆన్ విషయమును చూస్తే ఇలా కలదు. ఆకాశవాణి జ్ఞానమును వినిన జిబ్రయేల్ (సూర్యుడు) తాను కృతయుగములో మనువుకు తెలుగులో చెప్పిన జ్ఞానమునే కలియుగములో ముహమ్మద్ ప్రవక్తగారికి అరబ్బీ భాషలో చెప్పాడు. జిబ్రయేల్ ప్రవక్తగారికి చెప్పినప్పుడు వంద శాతము జ్ఞానమును చెప్పగా, ప్రవక్తగారు అర్థము చేసుకోవడములో కొంత పొరపాటుపడిన దానివలన, ప్రవక్తకు 90 శాతము జ్ఞానము అర్థమయి పది శాతము అర్థము కాకుండా పోయినది. ప్రవక్త తనకు అర్థమయిన జ్ఞానమును తన అనుచరులకు చెప్పగా, వారు పది శాతమును కోల్పోయి 80 శాతము జ్ఞానమునే అర్థము చేసుకొన్నారు. ప్రవక్త గారు చనిపోయిన తర్వాత ఖురాన్ గ్రంథము తయారయినదని కొందరు, లేదు ప్రవక్తగారు ఉన్నపుడే ఖురాన్ గ్రంథము తయారైనదని కొందరు చెప్పుచున్నారు. ప్రవక్త గారి జీవిత చరిత్రలో ఎక్కడా ఖుర్ఆన్ గ్రంథ ప్రసక్తి లేకపోవడము వలన ప్రవక్త చనిపోయిన తర్వాతనే ఖుర్ఆన్ గ్రంథము తయారయినదను వాదననే నమ్మవలసి వస్తున్నది. ఖుర్ఆన్ గ్రంథమును వ్రాసినది చదువు వచ్చిన వారు. ఆనాడు ప్రవక్త బోధలను విన్నది చదువురాని వాళ్ళు, 80 శాతము అర్థమయిన ప్రవక్త అనుచరులు ఇతరులకు చెప్పి గ్రంథమును వ్రాయించి

నప్పుడు, ఒకరినుండి మరొకరికి భావమార్పిడి జరిగినప్పుడు, కూడా పది శాతము జ్ఞానము నష్టపోయి కేవలము 70 శాతము జ్ఞానము గ్రంథరూప మైనది. ఈ విధముగా ఖురాన్ గ్రంథము 70 శాతము జ్ఞానముతో యున్నదని చెప్పవచ్చును. బైబిలు గ్రంథము 60 శాతము జ్ఞానమునే కల్గియున్నదని కొందరు చెప్పగా విన్నాము.

ఇట్లు దైవగ్రంథములు కొంత హెచ్చుతగ్గులుగా జ్ఞానమును కల్గియున్నవి. భగవద్గీత 85 శాతము, ఖుర్ఆన్ 70 శాతము, బైబిలు 60 శాతము జ్ఞానము కల్గియున్నదని కొందరు చెప్పగా విన్నాము. బైబిలు విషయమునకు వస్తే నాలుగు సువార్తలలో పూర్తి జ్ఞానము వ్రాయబడియున్నా మిగతా గ్రంథములో 40 శాతము అజ్ఞాన సంబంధ కల్పిత వ్రాతలున్నాయని కొందరు చెప్పుచున్నారు. వారు చెప్పు గణిత విధానము ఖచ్చితముగా ఇంతేనని నాకు నమ్మకము లేదుగానీ, కొంచెము ఎక్కువ తక్కువగా అయినా ఉండవచ్చునేమో చెప్పలేము. ఈ లెక్కప్రకారము భగవద్గీతలో 15 శాతము కల్పిత శ్లోకములు, కల్పిత జ్ఞానము ఉండునని చెప్పవచ్చును. అట్లే ఖుర్ఆన్ గ్రంథములో 30 శాతము మానవ కల్పితములు జరిగియుండవచ్చును. బైబిలులో 40 శాతము కల్పిత జ్ఞానముండవచ్చును.

దైవ గ్రంథములో మానవ కల్పితములు అంటే ఎవరికయినా ఆశ్చర్యముగానే ఉండును. ఒకవేళ కల్పిత జ్ఞానము కొంత శాతము ఉండినా ఏది కల్పిత జ్ఞానము, ఏది నిజమైన జ్ఞానమని గుర్తించుట ఎలాయని ప్రశ్న రాక తప్పదు. ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతను చూస్తే అందులో 15 శాతము మనుషుల అజ్ఞానము కలిసియున్నదని అనుకొన్నాము. మిగతా 85 శాతము దేవుని స్వచ్ఛమయిన జ్ఞానము కలదు. దేవుని జ్ఞానములో మనుషుల జ్ఞానము ఎలా కలిసియున్నదో

గమనిస్తే ఆశ్చర్యపోక తప్పదు. దేవుని జ్ఞానములో మనుషులు తమ జ్ఞానమును ఎవరూ గుర్తించని విధముగా కలిపియుండుట చాలా నేర్పరి తనముగా కనిపించుచున్నది. ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతలో మనుషుల జ్ఞానము కలిసియున్న విధానమును ఒకమారు చూస్తాము.

భగవద్గీత కర్మయోగమున తొమ్మిదవ శ్లోకము ముఖ్యమైన గుర్తింపు పొందిన శ్లోకము. ఈ శ్లోకమును దేవుడే చెప్పాడు. స్వచ్ఛమయిన దైవజ్ఞానముతో కూడుకొన్న శ్లోకము. అయితే ఇక్కడ మాయ పనిచేసి అజ్ఞానము వైపు పంపుటకు కూడా అవకాశము గలదు. ఈ శ్లోకము జ్ఞానము ప్రకారము చెప్పుకొంటే పూర్తి కర్మయోగమునకు సంబంధించిన శ్లోకము. ఈ శ్లోకములో **"యజ్ఞార్థా త్కర్మణో న్యత్ర"** అను వాక్యము కలదు. యజ్ఞ సంబంధమైన కర్మను ఆచరించకపోతే పాపపుణ్య కర్మలు అంటుకొనును అని చెప్పుటకు ఈ శ్లోకమును చెప్పారు. అయితే ఈ శ్లోకము యొక్క వివరమును లోతుగా చెప్పుకొంటే జ్ఞాన సంబంధముగా చెప్పుకోవచ్చును. లేకపోతే అజ్ఞాన సంబంధముగా బాహ్యాయజ్ఞములను ఆచరించమని కూడా చెప్పవచ్చును. ఈ శ్లోకము కర్మయోగ సంబంధ మైనదైనా, దానిని కేవలము బాహ్య యజ్ఞాచరణగా కూడా చెప్పుటకు అవకాశముండుట వలన, ఈ శ్లోకము ప్రక్కనే మనుషుల కల్పిత శ్లోకములను వరుసగా ఏడు శ్లోకములను వ్రాసియుంచారు. అలా వ్రాసి యుండుట వలన మొదటి కర్మయోగ శ్లోకము కూడా ఈ ఏడు శ్లోకములను ధృవీకరించునదిగా ప్రపంచ సంబంధ అర్థమునిచ్చునట్లు చెప్పుకోవడము జరిగినది. దీనిని అంతా చూస్తే ఎంతో తెలివిగా ఎవరూ గుర్తించలేనట్లు ఎక్కడ కలుపవలెనో అక్కడే కలిపారు. అక్కడే కలుపడము వలన తమ శ్లోకములకంటే ముందుగల దేవుని శ్లోకము కూడా మానవుల శ్లోకము

వలె బాహ్య యజ్ఞ సంబంధమైనదిగా కనిపించుచున్నది. ఇది కర్మ యోగములో చేసిన ప్రయోగముకాగా, తర్వాత జ్ఞానయోగములో ఇంకా గొప్ప అద్భుతమైన పని చేశారని చెప్పక తప్పదు.

జ్ఞానయోగము అను అధ్యాయములో మొదలు ప్రారంభము చివర ముగింపు చాలా గొప్పగా ఎవరూ గుర్తించలేని విధముగా జరిగినదని చెప్పవచ్చును. కర్మయోగమను అధ్యాయములో **"యజ్ఞార్థా త్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః"** అని చెప్పిన చోట తమ కల్పిత శ్లోకములను అతికించారు. ఇక్కడ జ్ఞానయోగమను అధ్యాయములో కర్మయోగములోని శ్లోకములోని అర్థమునిచ్చు **"యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే"** అని గల 23వ శ్లోకము ప్రక్కనే తొమ్మిది శ్లోకములను కలిపియున్నారు. వాస్తవముగా దేవుడు చెప్పిన శ్లోకములు 23వది అయిపోతూనే 24వ శ్లోకము **"శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్"** అను శ్లోకముండవలెను. అయితే 23, 24 శ్లోకముల మధ్య మొత్తము 9 శ్లోకములను కలిపియుండుట వలన **"శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్"** అను శ్లోకము 33వ నంబరుతో ప్రారంభమయినది. 23వ శ్లోకములో యజ్ఞము అను పేరుండుట వలన ఇక్కడ కలిపితే సరిపోవుననీ, తర్వాత ముగింపు కూడా యజ్ఞముల పేరే యుండుట వలన కల్పిత శ్లోకములు కూడా యజ్ఞములవే అయిన దానివలన సామాన్యముగా ఎవరూ గుర్తుపట్టలేరు అని అభిప్రాయముతో ఏకంగా తొమ్మిది శ్లోకములను కలిపివేశారు. యజ్ఞములను పేరుగల రెండు శ్లోకముల మధ్యలో కల్పిత శ్లోకములు కూడా యజ్ఞములను పేరుతో యుండడము వలన వాటిని ఇంతవరకు ఎవరూ కల్పిత శ్లోకములని గుర్తించలేక పోయారు.

జ్ఞానయోగములో 23వ శ్లోకమునందు "యజ్ఞ కర్మముల వలన కర్మ అంటదు" అని చెప్పాడు. దాని తర్వాత శ్లోకములలో యజ్ఞములు

రెండు రకములు కలవనీ ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞము అని చెప్పాడు. ఈ విధముగా పైన క్రింద యజ్ఞముల పేర్లుగల రెండు శ్లోకముల మధ్యలో అదే యజ్ఞముల పేర్లు గల తొమ్మిది శ్లోకములను కలుపడము వలన వాటిని గుర్తించడము ఎవరికీ చేత కాలేదు. ఇట్లు తెలివిని ఉపయోగించి తమ ప్రాధాన్యత కొరకు కొందరు తాము సృష్టించిన జ్ఞానమును దేవుని జ్ఞానము మధ్యలో ఇరికించి తమ జ్ఞానము కూడా దేవుని జ్ఞానముగా చలామణి అగులాగున చేశారు. ఇది ముందు పుట్టిన ఒక భగవద్గీతకే పరిమితము కాలేదు. ఈ జాఢ్యము మిగతా దైవగ్రంథములకు కూడా ప్రాకినది. ఇదంతా దేవునికి తెలియకుండా ఏమీ జరుగలేదు. కొందరిని తప్పుదారి పట్టించి తనకు దూరముగా పోవునట్లు దేవుడు రచించిన వాక్యములలో ఇది ఒకరకమని చెప్పవచ్చును. అందువలన మూడు గ్రంథములలో కొంతకు కొంత మానవుల కలుషిత జ్ఞానము దైవగ్రంథములలో చేరిపోయినదని చెప్పవచ్చును.

ఖుర్ఆన్ లోనికి వచ్చి చూస్తే భగవద్గీతలోకంటే కూడా ఎక్కువ కలుషిత వాక్యములున్నట్లు తెలియుచున్నది. భగవద్గీతలోవలే ఖుర్ఆన్‌లో సందర్భానుసారము తెలియకుండా వాక్యములను కలుపలేదు. కలుషిత వాక్యములున్నట్లు రూఢి ఏమి అని ఎవరయినా అడుగవచ్చును. దానికి శాస్త్రబద్ధమైన ఆధారమును చూపవలసియుంటుంది. శాస్త్రబద్ధమైన ఆధారమును చూపినప్పుడు, వాస్తవముగా అక్కడ యున్నది దేవుడు చెప్పినది కాదు, మనుషులు సృష్టించినదేయని సంపూర్ణముగా తెలియును. ఇక్కడ మరొక విషయమును దృష్టిలో పెట్టుకోవలసిన అవసరమున్నది. అదేమనగా! భగవద్గీతలోకంటే, బైబిలులోకంటే, ఖుర్ఆన్ గ్రంథములో స్థూల, సూక్ష్మమను రెండు రకముల వాక్యములు కలవు. స్థూలవాక్యములు అన్ని గ్రంథములలో

ఉండును. అయితే సూక్ష్మవాక్యములు ప్రత్యేకమైనవి సాధారణముగా అన్ని గ్రంథములలో ఉండవు. ఖుర్‌ఆన్ గ్రంథములో మిగతా రెండు గ్రంథములలో లేని సూక్ష్మవాక్యములు గలవు. భగవద్గీత, బైబిలు అను రెండు గ్రంథములలో దేవుడు ప్రజలకు జ్ఞానమును స్థూలముగానే బోధించాడు. రెండు గ్రంథములలో బోధించిన సులభతరమైన స్థూలవాక్యములనే మనిషి గ్రహించు కోలేని పరిస్థితిలో తప్పుగా అర్థము చేసుకోవడము జరుగుచున్నది. అటువంటప్పుడు సూక్ష్మముగా చెప్పిన వాక్యములను అర్థము చేసుకోవడము మరీ కష్టముగా ఉండును. వాక్యములో అర్థము కనిపించేటట్లు వ్రాయడమును స్థూలవాక్యములని అంటున్నాము. వాక్యములో అర్థము కనిపించకుండా ఇమిడియుండునట్లు వ్రాయడమును సూక్ష్మవాక్యములని అంటున్నాము.

అంతిమ దైవ గ్రంథము ఖుర్‌ఆన్ గ్రంథములో జిబ్రయేల్ చెప్పిన జ్ఞాన వాక్యములలో చాలావరకు అనగా ఎక్కువ శాతము సూక్ష్మవాక్యములే గలవు. వాటిని గుర్తించి ఇవి సూక్ష్మవాక్యములని తెలియకపోతే ఆ వాక్యములో చెప్పిన విషయము ఏమాత్రము అర్థము కాదు. అటువంటి వాక్యములు ఎలా ఉంటాయో? వాటిలోని అర్థమును ఎలా గ్రహించాలో తెలియుటకు గుర్తుగా, ఉదాహరణగా ఒక వాక్యమును తీసుకొని వివరించుకొని చూస్తాము.

ఇప్పుడు రెండవ సూరాలోని 187వ ఆయత్‌ను ఇక్కడ చూస్తాము.

**(2-187) "ఉపవాస రాత్రులందు మీరు మీ భార్యలతో కలుసు కోవడము మీ కొరకు ధర్మ సమ్మతము చేయబడినది. వారు మీకు దుస్తులు, మీరు వారికి దుస్తులు. మీరు రహస్యముగా ఆత్మద్రోహానికి పాల్పడుచున్నారనే సంగతి అల్లాహ్‌కు తెలుసు.**

**అయినప్పటికీ ఆయన క్షమా గుణముతో మీ వైపుకు మరలి, మీ తప్పును మన్నించాడు. ఇకనుండి మీరు మీ భార్యలతో ఉపవాస రాత్రులందు రమించడానికి, అల్లాహ్ మీ కొరకు రాసిపెట్టిన దానిని అన్వేషించటానికి మీకు అనుమతివ్వంది. తొలిజాములోని తెలుపు నడిరేయి నల్లని చారలోనుండి ప్రస్ఫుటమయ్యేవరకు తినండి, త్రాగండి. ఆ తర్వాత వీటినన్నిటిని పరిత్యజించి రాత్రి చీకటి పడేవరకు ఉపవాసము ఉండండి. ఇంకా మీరు మస్జిద్‌లలో "ఏతెకాఫ్" పాటించే కాలములో మాత్రము మీ భార్యలతో సమాగమం జరుపకండి. ఇవి అల్లాహ్ నిర్ధారించిన హద్దులు. మీరు వాటి దరిదాపులకు కూడా పోకండి. ప్రజలు అప్రమత్తముగా ఉండేటందుకుగానూ అల్లాహ్ తన ఆయతులను ఇలా విడమరచి చెప్పుచున్నాడు."**

ఈ ఆయత్‌లో 90 శాతము భార్యాభర్తలు ఒకరినొకరు కలుసుకొను విషయముండగా, పది శాతము రాత్రి తినండి, త్రాగండియని పగలు ఉపవాసముండండియని చెప్పియున్నారు. ఈ విషయమును అందరూ ప్రపంచ సంబంధముగానే చూస్తున్నారు. అయితే ముస్లీమ్‌లకు అర్థమయినది పది శాతము చెప్పిన 'రాత్రి తినండి, పగలు తినవద్దండి' అని చెప్పినదే నూరు శాతము అర్థమయినది. ఈ ఆయత్‌లో చెప్పిన 90 శాతము భార్యాభర్తల సంబంధమును వదలివేసి పదిశాతము 'రాత్రిపూట తినండి' అను విషయమునే చెప్పుకొనుచూ దానినే అందరూ ఆచరిస్తున్నారు. మేము ఈ ఆయత్ చూచిన తర్వాత ప్రపంచ సంబంధముగా అర్థము చేసుకొంటే ఈ విషయమును దేవుడు ఎందుకు చెప్పాడు? ఈ విషయములు ప్రపంచ

విషయములైనప్పుడు ఈ విషయములతో దేవునికి ఏమి పని ఉండును? అని ఆలోచించాము. ఈ వాక్యముకంటే ముందు 186వ వాక్యమును చెప్పియున్నందున ఆ వాక్యము ప్రకారము 187వ ఆయత్ మనుషులకు అర్థము కాలేదని తెలిసినది. **'పగలు ఉపవాసము'** అను విషయము పూర్తి దైవ సంబంధమైనదని తెలిసిపోయినది. వెనక్కు పోయి 184, 185వ వాక్యములను చూచిన తర్వాత 'ఉపవాసము' అనగా తినే తిండికి సంబంధించిన విషయము కాదనీ దైవికమైన యోగమని, అలా ప్రపంచ ధ్యాస లేకుండాపోయి దైవచింతనలో యుండడము ఉపవాసమగుననీ, దానికి కావలసిన జ్ఞానమును గురువువద్ద నుండి పొందడము ఉపదేశము అనీ, ఉపదేశమును పొందినవాడు, ఉపవాసము ఉండవలసిందేనని తెలిసి పోయినది. ఉపదేశమునే 'రంజాన్' అని చెప్పినట్లు, రంజాన్, రోజా అను పదములు ఖుర్ఆన్ గ్రంథముకంటే ముందే కృతయుగములోనే చెప్పబడినవని తెలిసిపోయినది. దానిప్రకారము నిజమైన ఉపదేశమును పొందిన వానిని 185వ వాక్యములో **రంజాన్‌ను పొందినవాడు** అని వ్రాయబడియుండడము మా భావమునకు చాలా దగ్గరయినది. అప్పుడు 187వ వాక్యములో వ్రాసిన భార్యాభర్తలు కలుసుకోవడమును ధర్మసమ్మతము చేయబడినదని చెప్పియుండడమును గురించి ఆలోచించగా కొంత విషయము అర్థమయి నది. అదేమనగా! అక్కడ చెప్పినది భార్యాభర్త శరీర సంబంధముగా కలుసుకోవడమును గురించి కాదు. భార్యాభర్తలు కలుసుకోవడానికి అనగా లైంగిక విషయముల దగ్గర కూడా దైవ సంబంధమైన ధర్మము ఉంటుందా? యని ప్రశ్న రాక తప్పదు. అలా ప్రశ్నించుకొని చూస్తే ఆ విషయములో దేవుడు ఏమీ చెప్పలేదు అనీ, ఆ పనులన్నియూ వారివారి కర్మలనుబట్టి ముందే నిర్ణయింపబడి యుండునని చెప్పక తప్పదు. ప్రతి

చిన్న ప్రపంచ విషయము ముందే వ్రాసిపెట్టబడిన కర్మపత్రము ప్రకారము జరిగి తీరవలసిందే. ఈ విషయములో ధర్మమనునది ఉండదు. ఆ విషయము మీద దేవుడు ఎటువంటి ధర్మనిర్ణయము చేయలేదు. వాక్యమును మనము సరిగా గ్రహించుకోలేదు.

గ్రంథ ప్రారంభమందే మూడవ సూరా మొదటిలోనే ఏడవ ఆయత్‌లో ఈ గ్రంథములో **ముతషాబిహాత్** వాక్యములున్నవని గ్రంథమును బోధించిన జిబ్రయేల్‌గారే చెప్పడమైనది. జ్ఞానమును వాక్యరూపములో బోధించగా అది గ్రంథరూపమై ప్రజలలోనికి పోయినప్పుడు దానిని సరిగా అర్థము చేసుకోలేకపోతే చేసిన పని వ్యర్థమగునని జిబ్రయేల్ మొదటే తాను చెప్పిన వాక్యములలో ముతషాబిహాత్ (సూక్ష్మ అర్థములుగల) వాక్యములున్నవని చెప్పడమైనది. జిబ్రయేల్ ముందే చెప్పినా, చాలామంది ముస్లీమ్‌లు ముతషాబిహాత్ వాక్యములున్నట్లుగానీ, వాటికి సూక్ష్మమైన అర్థమున్నది అనిగానీ, బయటికి చెప్పుకోవడము లేదు. ఎవడయినా సూక్ష్మముగా వివరము చెప్పువాడు ఉంటే 'ఇవి మనుషులు చెప్పు విషయములు కావు దీని అర్థము దేవునికే తెలుసు' అని వానిని హేళన చేయుచున్నారు. మనుషులు స్వయముగా చెప్పలేరు అని నేను కూడా ఒప్పుకొంటాను. అయితే మనిషిలోయున్న దేవుడు చెప్పవచ్చును కదా!యని ఎవరూ అనుకోవడము లేదు. ఈ విధముగా ముతషాబిహాత్ వాక్యముల వివరము మనుషులు తెలియలేక పోయారు.

దేవుడు ముతషాబిహాత్ వాక్యములను చెప్పకుండా స్థూలమైన ముహ్కమాత్ వాక్యాలే చెప్పియుంటే బాగుండేది కదా!యని కొందరు అడుగ వచ్చును. దానికి నా సమాధానము ఏమనగా! దేవుడు అన్నీ తెలిసిన వాడు. ఆయన మనుషులు చదివే వాక్యము మనుషులకు సులభముగా

అర్థము కాకూడదనే అటువంటి సూక్ష్మ అర్థముగల వాక్యములను పెట్టాడు. అటువంటి వాక్యములను తెలియాలని ఎవడు తపన పడునో, వానికి 2-186 వాక్యములో చెప్పినట్లు తానే వాని శరీరములోనుండే తెలియజేయును. కష్టమైన వాక్యములు దేవుని మీద నమ్మకము లేనివారికి అర్థము కాకూడదనే ఉద్దేశ్యముతోనే దేవుడు ఉంచడము జరిగినది. నేడు ఎంతో ముస్లీమ్ సమాజము భూమిమీద గలదు. కొన్ని కోట్ల సంఖ్యలో ముస్లీమ్‌లు ఉండగా, అందులో లక్షలు, వేలు, నూర్లు, పదుల సంఖ్యలో కూడా కొన్ని విషయములు సక్రమముగా అర్థమైన వారున్నారని చెప్పలేము. ముస్లీమ్‌లలో ఒక క్రమశిక్షణ గలదు. ఏ ఇతర మతములలో లేని క్రమశిక్షణ ముస్లీమ్‌లలో యుండుటను గొప్పగా చెప్పుకోవచ్చును. అటువంటి గొప్పతనము మిగతా మతములలో లేదనియే చెప్పవచ్చును. అయితే వారి పెద్దలు ఎలా చెప్పితే అలా వినడము క్రమశిక్షణే అయితే అది ప్రపంచ విషయములలో గొప్పగానే కనిపించుచుండును. కనిపించే విధముగా పెద్దల మాటప్రకారము నడువ గల్గుట గొప్ప పనియేయగును. అదే పరమాత్మ (దేవుని) విషయములోనికి వచ్చేటప్పటికి (6-91) ఆయత్‌లో **"నేను చెప్పిన జ్ఞానము మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియదు"** అని దేవుడే చెప్పియుండుట వలన దేవుని జ్ఞానము వారి పెద్దలకు కూడా తెలియదనియే చెప్పవచ్చును. అందువలన దేవుని జ్ఞాన విషయములో 'పెద్దలు చెప్పినట్లు వింటాము' అనే క్రమశిక్షణే నష్టమును చేకూర్చినది. ప్రపంచ విషయములో గొప్పగా చెప్పబడిన క్రమశిక్షణ జ్ఞాన విషయములో జ్ఞానమును తెలియకుండా చేసినది. పెద్దలు చెప్పినట్లు వినడము వలన వారు చెప్పిన కొన్ని తప్పు భావములు అందరికీ ప్రాకి పోయినవి. ఉపవాస విషయములో అదే జరిగినది. అట్లే 'భార్యాభర్త కలయిక' అను విషయములో అదే జరిగినది.

సూరా రెండు 184, 185 ఆయత్‌లలో చెప్పిన, చెప్పబడిన **'ఉపదేశము'** ఏమిటో అక్కడగల **'ఉపవాసము'** ఏమిటో తెలియకుండా పోయినది. అదే విధముగా 187వ ఆయత్‌లో 90 పాళ్ళు భార్యాభర్తల కలయిక విషయము చెప్పితే అది దంపతుల శారీరక కలయిక క్రిందికి పోల్చుకొన్నారు. అలా అనుకొనే ముందు ఈ విషయములో దేవునికి సంబంధము లేదు కదా! దేవుడు చెప్పునది జ్ఞాన విషయము కదా! కర్మకు సంబంధించిన ప్రపంచ విషయము ఎందుకు చెప్పును? అని కొద్దిగయినా ఆలోచించలేకపోయారు. మనిషికి ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా కష్టములు సుఖములు శరీరములోని జీవునికి చేరుచుండును. ఆహార విషయమునకు వస్తే వాడు చేసుకొన్న కర్మను అనుసరించి వానికి ఏ ఆహారము దొరకవలెనో అది నిర్ణయము ముందే జరిగిపోయివుండును. దేనిని ఎప్పుడు తినవలెనని వ్రాసిపెట్టబడియుంటే అది అప్పుడే లభించును. సుఖ దుఃఖములను ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా మనిషి అనుభవించుట జరుగుచున్న సత్యము. నాలుక ద్వారా రుచి అనే సుఖమును అనుభవించ వలసి యుండును. మనిషి ఏ మతస్థుడయినా గానీ అది పైన విషయమేగానీ లోపల మాత్రము అందరికీ అన్ని మతముల వారికీ ఒకే విధానము గలదు. ఒకే నాలుక ద్వారా మనిషి రుచి యను సుఖమునో కష్టమునో అనుభవించ వలసి యుండును. మనిషి ఆహారము నాలుకకు సంబంధించినది. అంటే శరీర ఇంద్రియ సంబంధమైనది. అలాగే భార్యాభర్త శరీర కలయికకు సంబంధించిన విషయము, ఐదు జ్ఞానేంద్రియములలో చర్మమునకు సంబంధించినది. ఇక్కడ ముస్లీమ్‌కని, హిందువుకని, క్రైస్థవులకని వేరువేరు విధానము ఉండదు. శరీరమున్న వారికందరికీ ఒకే విధానముండును. శరీరములో ఐదు జ్ఞానేంద్రియములు వరుసగా ఇలా గలవు. 1) కన్ను, 2) ముక్కు, 3) నాలుక, 4) చెవి, 5) చర్మము. ఈ ఐదు ప్రపంచ సుఖ

దుఃఖములకు ద్వారములలాంటివి. వీటివలననే శరీరములోని జీవునికి కష్టసుఖములు చేరుచుండును. ఆహార సుఖము **నాలుక** ద్వారా లోపలి జీవునికి చేరగా, భార్యాభర్తల కలయిక సుఖము **చర్మము** అను జ్ఞానేంద్రియము ద్వారా చేరును. ఈ ఐదు అవయవ సుఖదుఃఖములు మనిషి చేసుకొన్న కర్మనుబట్టి యుండును. ఈ విషయములను దేవుడు మనిషిని జన్మకు పంపినప్పుడే తన తీర్పులో కర్మపత్రముగా వ్రాసి పంపియుండును. కర్మపత్రములో ముందే వ్రాసిన దానిప్రకారమే ఆహారముగానీ, భార్యభర్తలు ఉండడము గానీ జరుగుచుండును. మధ్యలో దేవుడు వీటి జోక్యము చేసుకోడు. జీవుని కర్మనుబట్టి ఆత్మ వానిని తోలుచుండగా, అల్లాహ్ (దేవుడు) సాక్షిగా చూస్తూ యుండును. ఇదే విషయమే సూరా 50, ఆయత్ 21 (50-21)లో చెప్పడమైనది. అక్కడ చెప్పిన వాక్యమును మనుషులు మరువకూడదు.

సుఖదుఃఖములకు అతీతమైనది నిద్ర. దేవుడు మనిషికి కష్ట సుఖములను కర్మబద్ధము చేశాడుగానీ నిద్రను కర్మకు అతీతము చేశాడు. అందువలన నిద్రలో సుఖము ఉండదు, కష్టము ఉండదు. సుఖదుఃఖ కర్మలు అమలు కానప్పుడు మనిషి నిద్రలోనికి పోవును. మనిషి పగలు మెలుకువగల్గి కర్మలు ఆచరించునట్లు, రాత్రిపూట కర్మలకు అతీతముగా నిద్రపోవునట్లు దేవుడు నిర్ణయించాడు. నిద్రలో శరీరము అను ప్రకృతి (స్త్రీ), పురుషుడు అనబడు ఆత్మ రెండు ఏకమైపోవును. అప్పుడు పురుషుడుగా యున్న ఆత్మగానీ, ప్రకృతి (స్త్రీ) గాయున్న శరీరముగానీ వేరువేరుగా లేకుండా ఒకటిగాయుండును. దానినే 'స్త్రీ పురుషుల కలయిక' అని అంటారు. శరీరములో నివశించు ఆత్మ శరీరముతో కలిసిపోయినప్పుడు నిద్రయగును. అట్లే శరీరమే ఆత్మలో కలిసినప్పుడు కూడా నిద్రయేయగును.

అందువలన ఆత్మ శరీరమును కలియవచ్చును. శరీరము ఆత్మను కలియవచ్చును. ఇక్కడ మీకు అర్థమగుటకు శరీరమును ప్రకృతియనీ, ఆత్మను పురుషుడనీ చెప్పడమైనది. భగవద్గీత గ్రంథములో ప్రకృతివలన తయారయిన శరీరమును స్త్రీ అంశయనీ, ఆత్మను, జీవాత్మను, పరమాత్మను ముగ్గురు పురుషులని చెప్పడమైనది. ఆత్మ పురుషుడని చెప్పుచూ ఆత్మ, శరీరము కలిసినప్పుడు నిద్రయగును. అప్పుడు శరీరములో సుఖ దుఃఖములను జీవుడు అనుభవించుట లేదు.

సూరా రెండు ఆయత్ 187లో ప్రకృతి ఆత్మలో కలియవచ్చును. ఆత్మ ప్రకృతిలో కలియవచ్చును అను విషయమును 'మీకు మీ భార్యలు దుస్తులు, మీ భార్యలకు మీరు దుస్తులు' అని చెప్పారు. భార్య అనగా భరించబడునది ప్రకృతియనీ, భర్త అనగా భరించువాడు ఆత్మయని తెలియ వలెను. నిద్రను భార్యాభర్తల కలయికగా చూడవలెను. మనిషి రాత్రి పడుకొని నిద్రపోయేదానికి శరీరములో దేవుడు నిర్ణయించాడు. దానినే 'ధర్మసమ్మతము చేయబడినది' అని చెప్పాడు. రాత్రిపూట నిద్ర పోయేది ధర్మసమ్మతము. అందువలన రాత్రిపూట నిద్రపోవడము వలన పాపము రాదు. పగలు పూట నిద్ర అధర్మము. పగలు నిద్ర ధర్మసమ్మతము కానిది. పగలు నిద్ర పోవువారిని 'మీరు రహస్యముగా ఆత్మద్రోహానికి పాల్పడుచున్నారని' చెప్పాడు. అందువలన రాత్రిపూట నిద్రపోవడము ధర్మసమ్మతము చేయబడినది. అయితే తొలిజాములోని తెలుపు చీకటి నుండి కనిపించే వరకు అనగా, **నాలుగు నుండి ఆరుగంటల వరకు** రెండు గంటలు మీ కొరకు దేవుడు తెల్పిన జ్ఞానమును, వ్రాసిపెట్టబడిన దైవగ్రంథము లలో అన్వేషించటానికి అనుమతివుంది అని చెప్పాడు. తెల్లవారుజామున రెండు గంటల కాలము దేవుని జ్ఞానమును గ్రంథములలో వెదకి తెలుసు

కొనుటకు దేవుడు అనుమతి ఇచ్చాడు. అందువలన ఆ సమయములో మేల్కొనడము ధర్మసమ్మతమే. మిగతా రాత్రి మేలుకోవడము పగలు చేయవలసిన పనులు రాత్రి చేయడము అధర్మమగును. 'తొలి జాములో తెల్లని సారలు కనిపించే వరకు తినండి, త్రాగండి' అని వున్నది కదా!యని కొందరు అడుగవచ్చును. దానికి నా జవాబు ఇలా కలదు. మీ కొరకు వ్రాసిపెట్టబడిన దానిని అన్వేషించండి అని చెప్పి, ఆ పని చేయవలసింది తెల్లవారుజామున యని చెప్పి, అప్పుడు మీకు చదువువస్తే చదవండి. చదువు రాకపోతే ఇతరుల ద్వారా వినండి అని చెప్పాడు. **'చదవండి, వినండి'** అని చెప్పు మాటను చాటుగా తినండి, త్రాగండియని చెప్పారు. దైవ జ్ఞానమంతా అలాగే చెప్పబడుచూ వుంటుంది. దానిని **బుద్ధి శ్రద్ధ** కల్గినవాడు తెలియగలడు అని (3-7) లో చెప్పడమైనది. తెల్లవారిన తర్వాత వినేది, చదివేది వదలి దానిని ఆచరించుచూ యోగమును (ఉప వాసమును) చేయవలెను. యోగము (ఉపవాసము) అనగా జీవాత్మ, ఆత్మతో కలిసి నివశించడము అని అర్థము. ఆత్మ, జీవాత్మ కలిసియుండు దానిని 'యోగము' అని అంటాము. దానినే వాక్యములో ఉపవాసము అని చెప్పారు. **పగలు యోగము, రాత్రి నిద్ర, తెల్లవారు జామున జ్ఞానము తెలియుట** మనిషికి ధర్మసమ్మతము చేయుటయని ఈ వాక్యములో తెలిసినది. దేవుడు చెప్పిన విషయమును సూక్ష్మముగానే యోచించాలి గానీ, స్థూలముగా యోచించితే అక్కడ చెప్పిన జ్ఞాన రహస్యము తెలియకుండా పోతుంది.

ఈ విధముగా చూస్తే సూక్ష్మవాక్యములు తెలియడమే కాక వాటిలోని బోధలు రహస్యముగా యుండునని తెలియుచున్నది. కొన్ని స్థూల వాక్యములు కూడా కలవు. స్థూలవాక్యమును తీసుకొని చూస్తే అందులో

రహస్యము ఇమిడియుండక పోయినా అది ప్రపంచ సంబంధమైనదా లేక పరమాత్మ సంబంధమైనదాయని తెలియనగును. పరమాత్మ సంబంధమైన దైతే స్థూలమునయినా గ్రహించి తెలుసుకోవచ్చును. అదే ప్రపంచ సంబంధమైనదైతే అది జ్ఞాన బోధలోనికి సంబంధించినది కాదని చెప్పవచ్చును. అటువంటప్పుడు అది ప్రపంచ సంబంధమైనదని తెలిసి దానిని మానవుడు కల్పించి గ్రంథములో చేర్చిన వాక్యమని గుర్తించవచ్చును. అటువంటి వాక్యములు ఎన్నియున్నా వాటిని ఎవరంతకు వారు వదలి వేయడము మంచిది. దానిని గురించి ఇతరులతో అవును కాదు అని చర్చించవలసిన అవసరము లేదు. నీకు ఇది ప్రపంచ విషయమని తెలిసి దైవగ్రంథములో ప్రపంచ విషయములకు తావులేదని తెలిసినా ఆ విషయమును ఇతరులు ఒప్పుకోరు. వారు దానిని దేవుని గ్రంథములోని వాక్యముగానే లెక్కించుచుందురు. అందువలన వారు వాదించు అవకాశమున్నది. అటువంటప్పుడు వాదనలకు తావు ఇవ్వకుండా నీకు తెలిసినంత వరకు నీవు తెలుసుకొని ప్రపంచ వాక్యములకు దూరముగా, దేవుని వాక్యములకు దగ్గరగా ఉండడము మంచిది.

ప్రపంచ విషయమైనా దేవుని వాక్యముగా గ్రంథములో కలిసి పోయిన ఒక వాక్యమును ఇప్పుడు చూస్తాము. ఇంతకుముందు ఐదవ సూరాలో మూడవ ఆయత్‌ను గురించి చెప్పుకొన్నాము. అందులో స్థూలముగా యున్న విషయము తప్ప సూక్ష్మముగా ఏమీలేదు. స్థూలముగా మనుషులు తిను ఆహారమును గురించి అక్కడ చెప్పారు. కొన్ని ఆహారములను తినమనీ, కొన్ని ఆహారములు తినకూడదని నిషేధమును విధించారు. రక్తము, పందిమాంసము, చనిపోయిన జంతువులు, ఇతర దేవతలకు బలి ఇచ్చినవి, క్రూర మృగముల చేత చంపబడిన జంతువులను

తినవద్దని చెప్పారు. ఇది ఖుర్‌ఆన్ గ్రంథములోని వాక్యము అనుటయే కాక ముస్లీమ్ పెద్దలు చాలామంది ఈ ఆహారములను తినవద్దని చెప్పియుండడమే కాక తాము కూడా తినకుండాయున్నారు. ఇక్కడ మనము బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఆలోచించ వలసియుంటుంది. శాస్త్రమునకు సరిపోకపోతే, శాస్త్రబద్ధము కాకపోతే దానిని దేవుని వాక్యముగా లెక్కించకూడదు.

శాస్త్రము ప్రకారము చూస్తే కర్మవలన మనిషికి కష్ట సుఖముల అనుభవము జరుగుచుండును. కష్టమును అనుభవించవలెనంటే దానికి తగిన పాపము ఉండవలెను. అలాగే సుఖమును అనుభవించుటకు దానికి తగిన పుణ్యము ఉండవలెను. మనిషికి లభించు ఆహారము వలన సుఖము మరియు కష్టము రెండు ఉండును. మంచి రుచికరమైన ఆహారము ద్వారా సుఖమును అనుభవించును. నాలుకకు రుచి దొరకడము వలన జీవుడు సుఖమును పొందును. అందువలన మంచి రుచికరమైన ఆహారము లభించుటకు పుణ్యము అవసరము. ఒకవేళ రుచిలేని ఆహారము చెడిపోయిన ఆహారము దొరికినప్పుడు మనిషి దానిని తినుటకు బాధపడవలసి వచ్చును. అట్లు మంచి ఆహారము కాకుండా చెడు ఆహారము దొరుకుటకు వాని పాపమే కారణము అని చెప్పవచ్చును. పాపపుణ్య కర్మలను బట్టి మంచి చెడు ఆహారములు లభించును. కర్మలన్నియూ ప్రపంచ సంబంధమైనవి. కర్మలకు అతీతమైనది జ్ఞాన సంబంధమైనది. గత జన్మ పాపపుణ్యములను బట్టి ఎప్పుడేది తినవలెనని నిర్ణయము జరిగియుండును. కర్మ నిర్ణయము ముందే జరిగియుండును, కనుక ప్రారబ్ధకర్మను మార్చుటకు వీలులేదు. నిషేధిత ఆహారము అనునది కర్మసిద్ధాంతములో లేదు. ప్రాప్తానుసారము లభించినది తినవలసియుంటుంది. 'నేను తినను' అను మన ఇష్టము

అక్కడ పని చేయదు. నిర్ణయము జరిగిన దానిని తినక తప్పదు. ఇదంతా దేవుడు పెట్టిన కర్మచట్టమే. కర్మకు సంబంధించిన దానిలో దేవుని జోక్యముండదు. అందువలన ఆహార నియమమును దేవుడు చెప్పియుండడు. ఈ వాక్యము మనుషులు చెప్పినదిగా యున్నది. ఒకవేళ ఇది ఏదయినా సూక్ష్మవాక్యము అనుటకు కూడా వీలులేదు. ఈ వాక్యములో స్థూలమే యున్నది. కర్మప్రకారము నిర్ణయించినది తప్పక జరుగునని ప్రథమ దైవ గ్రంథమున చెప్పిన దేవుడు తన మాటకు వ్యతిరేఖముగా అంతిమ దైవ గ్రంథములో చెప్పడు కదా! అందువలన ఆహారము లభించుట, లభించక పోవుట, మంచిది గానీ, చెడుది గానీ లభించుట, లభించక పోవుట వాని కర్మనుబట్టి యుండును. అందువలన అన్ని విధముల బ్రహ్మ విద్యా శాస్త్రము ప్రకారము దీనిని 'కల్పిత వాక్యమని' తేల్చి చెప్పవచ్చును. ప్రపంచ సంబంధ విషయములన్నియూ కర్మకు సంబంధించినవి. వాటియందు మనిషికి స్వతంత్రత యుండదు. స్వతంత్రత జ్ఞానము తెలియుట యందు, దేవుని ఆరాధన చేయుట యందు ఉండును. అందువలన దేవుడు మనిషికి దైవ జ్ఞానమును ప్రథమ దైవగ్రంథమునందు చెప్పాడు. అదే విధానమును అనుసరించి మిగతా రెండు గ్రంథములయందు కూడా దైవ జ్ఞానమును చెప్పాడు. ప్రపంచ పనులను చేయవద్దని చెప్పలేదుగానీ, తన ప్రార్థన చేయమన్నాడు. ప్రార్థన మనిషి ఇచ్ఛప్రకారము జరుగును. ప్రపంచ కార్యములు మనిషి ఇష్టప్రకారము జరుగవు. అందువలన దేవుడు (అల్లాహ్) ఈ వచనమును ఏమాత్రము చెప్పియుండడు. మనిషికి దేవుని జ్ఞానము చెప్పబడినది. దేవుని జ్ఞానము ప్రకారము దేవుని ఆరాధన చెప్పబడినది. అంత తప్ప ప్రపంచ సంబంధమైనవి, కర్మ సంబంధమైనవి చెప్పలేదు.

**17) ప్రశ్న :- ఇప్పుడు అడుగు ప్రశ్నను ఇంతకుముందు చాలామార్లు,**

**చాలామంది ముస్లీమ్ పెద్దలను అడిగాను. అయితే ఎవరూ ఇంతవరకు సరియైన జవాబును ఇవ్వలేదు. శాస్త్రబద్ధతను చూపకుండా ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు చెప్పుచున్నారు. అందువలన మాకు ఈ ప్రశ్నకు జవాబు దొరకలేదనియే చెప్పవచ్చును. నేను అడుగు ఈ ప్రశ్నకు దయచేసి జవాబును చెప్పవలసినదిగా కోరుచున్నాను. ఈ ప్రశ్న ఏమనగా! ముహమ్మద్ ప్రవక్తగారికి జిబ్రయేల్ జ్ఞానము చెప్పాడని, 23 సంవత్సరముల నుండి ఖుర్‌ఆన్ జ్ఞానమును ప్రవక్త తన ప్రజలకు జిబ్రయేల్ చెప్పిన జ్ఞానమునే చెప్పాడు. ఇది వాస్తవమే గానీ కొందరు ఆకాశవాణి ప్రవక్త గారికి చెప్పిందని అంటున్నారు. గ్రంథములో కూడా అక్కడక్కడ ప్రవక్త గారికి వహీ ద్వారా జ్ఞానము వచ్చిందని అంటున్నారు. ఇందులో ఏది నిజము? అని అడుగుచున్నాను.**

**జవాబు :-** దేవుడు మూడు విధములుగా తన బోధను తెలుపుదునని ఖుర్‌ఆన్ గ్రంథమునందే 42వ సూరా 51వ ఆయత్‌నందు చెప్పియున్నాడు. అక్కడ చెప్పినది ఇలా కలదు. **(42-51) "దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. దేవునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పనికాదు. దేవుడు తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) లేక తెర వెనుక నుంచి మనిషికి చేరవేస్తాడు. లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు."** ఇక్కడ ఈ వాక్యములో దేవుడు మనుషులకు జ్ఞానమును తెలియజేయు మూడు పద్ధతులు తెలిపాడు. అందులో ఒకటి వాణి (వహీ) ద్వారా చెప్పడము అని కలదు. 'వాణి' అనగా శబ్దము అని అర్థము. శబ్దము ద్వారా సృష్ట్యాదిలోనే దేవుడు జ్ఞానమును చెప్పడమైనది. అయితే అది

నేరుగా మనుషులకు చేరలేదు. 'దేవుడు ప్రతి విషయమును తెలిసినవాడు'. దేనినయినా ఒక ప్రణాళికాబద్ధముగా చేయగలడు. దేవుడు మనుషుల కొరకు వాణి ద్వారా చెప్పిన జ్ఞానము మనుషులకు చేరలేదు కదా!యని కొందరు అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగా గలదు. 'దేవుడు ప్రణాళిక ప్రకారము ఏదయినా చేయును' అని చెప్పుకొన్నాము కదా! కనుక దేవుడు మొదట అలా చెప్పడమునకు కూడా కారణము గలదు. ఈ విషయమును పూర్తి వివరముగా తెలియగలిగితే ఇలా కలదు.

'దేవుడు ఏ పని చేయనివాడు. దేవుడు నామ, రూప, క్రియా రహితుడు'. క్రియారహితుడయిన దానివలన ఆయన తన జ్ఞానమును ప్రజలకు చెప్పు కార్యమును కూడా చేయడు. అట్లు చేస్తే తన ధర్మమునకు తానే వ్యతిరేఖముగా నడచినట్లగును. కావున దేవుడు తన పనిని చేయుటకు సృష్ట్యాది నుండి ఆత్మను తయారు చేసి పెట్టుకొన్నాడు. జ్ఞానమును చెప్పుటకు ఆత్మను సృష్ఠించిన వాడే జ్ఞానమును వినుటకు జీవున్ని కూడా తయారు చేసుకొన్నాడు. దేవుడు ఆత్మస్వరూపుడు అయిన దానివలన తన స్వరూపము నుండి ఆత్మను, జీవాత్మను సృష్ఠించాడు. తర్వాత సర్వజీవులను సృష్ఠించాడు. అయితే దేవుని సృష్ఠిలో తయారయిన జీవులందరూ రెండు విధముల విభజింపబడినారు. ఒక విభాగము వారందరూ పాలించబడువారు. రెండవ భాగమంతయూ పాలించువారు గలరు. పాలించు వారిలో గ్రహములు, భూతములు అను రెండు రకముల వారుండగా, పాలించబడు వారిలో మనుషులు, జంతువులు, వృక్షములు, తీగలు, క్రిములు, కీటకములు అనునవి గలవు. వీటన్నిటియందు జీవాత్మ, ఆత్మలుండును. దేవుడు సృష్ఠించిన రెండు భాగముల వారికి జ్ఞానము తెలియవలెనను ఉద్దేశ్యముతో మొదట జ్ఞానమును తాను స్వయముగా చెప్పక ఆకాశవాణి ద్వారా

ఉరుముల శబ్దముతో చెప్పించెను. ఆకాశము ఒక భూతమగుట వలన వినేదేగానీ చెప్పేది కాదు. కావున ఆకాశములో యుండు ఆత్మయే స్వయముగా జ్ఞానమును చెప్పగలిగింది. దేవుని పనిని చేయునది ఆత్మే.

ఆకాశ భూతములో యున్న ఆత్మ, ఆకాశ శబ్దమయిన ఉరుముల శబ్దముతో దేవుని జ్ఞానమును బహిర్గతము చేయగా ఆ శబ్దమును ఆకాశములోని సూర్యగ్రహము వినగలిగినది. శబ్దములలోని జ్ఞానమును తెలియగలిగినది. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియదు. మానవులకే కాదు చరాచర ప్రపంచములో ఎవరికీ తెలియదు. అయితే దేవుని ప్రతినిధియైన ఆత్మకు ఒక్కనికి తెలుసు. అందువలన దేవుడు పని చేయకుండా దేవుని పనిని ఆత్మ చేయగలిగింది. అప్పుడు సృష్ఠిని పాలించు పాలకులలో ముఖ్యుడయిన సూర్యుడు శబ్దములోని జ్ఞానమును గ్రహించగలిగి తాను తెలిసిన జ్ఞానమును ఇటు పాలించు వారికి, అటు పాలించబడు వారికి ఇరువురికీ తెలియజేశాడు. ఈ విధముగా దేవుడు అనుకొన్నది నెరవేరినది. నెరవేరిన విధానమును వివరించుకొంటే ఇలా కలదు. ఆకాశవాణి నుండి శబ్దమును గ్రహించిన సూర్యుడు తన పరివారమైన పాలించు వారందరికీ జ్ఞానమును పైన ఆకాశములోనే తెలిపాడు. తర్వాత మనుషులకు తెలుపుటకు భూమిమీదకు వచ్చి దక్షిణ భారతదేశమున గల **'మనువు'** అను వ్యక్తికి మొట్టమొదట జ్ఞానమును తెలిపాడు. తర్వాత మనువు ద్వారా భూమండలమంతా జ్ఞానము ప్రాకిపోయినది.

దేవుడు చెప్పిన మూడు విధానములలో ఆకాశ వాణి ద్వారా చెప్పు విధానము సృష్ట్యాదిలోనే జరిగిపోయినది. **వాణి ద్వారా (వహీ ద్వారా)** చెప్పిన జ్ఞానము మొదట పాలకులకు చేరి తర్వాత పాలించబడే వారికి

చేరినది. వాణి ద్వారా చెప్పిన జ్ఞానము కృతయుగము మొదటిలో చెప్పగా ద్వాపర యుగము చివరిలో గ్రంథరూపమైనది. దానినే 'ప్రథమ దైవ గ్రంథము' అని అంటున్నాము. ప్రథమ దైవ గ్రంథము పేరే **"భగవద్గీత"** యని చెప్పుచున్నాము. దేవుడు చెప్పిన మొదటి విధానము గ్రంథమయిన దానివలన దానిని ప్రథమ దైవగ్రంథమని అంటున్నాము. మూడు విధానములలో ఒక విధానము సృష్ట్యాదిలోనే గడచిపోగా, ఇంకా రెండు విధానములు మిగిలియున్నవి. మిగిలిన రెండు విధానములలో **"తన ప్రతినిధిని పంపి తన ప్రతినిధి ద్వారా జ్ఞానమును చెప్పించడము"** అను విధానము ఏసు ద్వారా చెప్పించడము జరిగినది. ఏసు దేవుని ప్రతి నిధిగా జ్ఞానమును చెప్పగా అది గ్రంథరూపమైనప్పుడు దానిని 'ద్వితీయ దైవగ్రంథము' అని అన్నాము. ఇట్లు దేవుడు చెప్పిన రెండు విధానములు జరిగిపోగా మూడవ విధానము **"తెరచాటునుండి చెప్పెడిది"** ఒకటి మిగిలియుండెను. చివరికది ముహమ్మద్ ప్రవక్త కాలములో నెరవేరినది. జిబ్రయేల్ తెరచాటునుండి ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పాడు. అట్లు చెప్పిన జ్ఞానము చివరికది గ్రంథరూపమైనప్పుడు దానినే అంతిమ దైవగ్రంథము అన్నాము. దేవుడు చెప్పిన మూడు విధానములు నెరవేరిన వరుసను బట్టి ఆయా గ్రంథములకు ఆయా పేర్లు రావడము జరిగినది. చివరిలో నెరవేరిన జ్ఞానము పేరు 'చివరి దైవ గ్రంథము' అని అన్నారు.

ఖురాన్ గ్రంథములో (42-51) లో చెప్పినది వరుసగా **ఒకటి వాణి (వహీ) ద్వారా, రెండు తెరచాటునుండి, మూడు తన ప్రతినిధి ద్వారా జ్ఞానమును తెలుపడము** అని కలదు. అయితే ఇక్కడ భూమిమీద నెరవేరినది మొదటిది మొదటనే నెరవేరినది. తర్వాత చివరిలోనిది రెండవ మారు నెరవేరినది. మధ్యలో చెప్పినది చివరిలో నెరవేరినది. భూమిమీద

నెరవేరిన దానినిబట్టి అక్కడ చెప్పిన బోధలకు వరుసగా అదే పేర్లు పెట్టి ప్రథమ దైవగ్రంథము, ద్వితీయ దైవగ్రంథము, అంతిమ దైవగ్రంథము అని చెప్పడము జరిగినది. మధ్యలో చెప్పిన తెరచాటునుండి చెప్పునది చివరిలో నెరవేరగా! చివరిలో చెప్పిన తన ప్రతినిధి ద్వారా జ్ఞానము చెప్పడము మధ్యలో నెరవేరినది. చివరిలో నెరవేరిన తెరచాటునుండి చెప్పడము ఎలా జరిగినదో వివరించుకొని చూస్తే ఇక్కడ నీవు అడిగిన ప్రశ్నకు జవాబు దొరుకగలదు. ప్రశ్నలో వహీ (వాణి) ద్వారా విన్నాడా లేక జిబ్రయేల్ చెప్పడము ద్వారా విన్నాడా? అని అడిగారు. ఇక్కడ ప్రతి మనిషికి పూర్తి నూరు శాతము విచక్షణ అవసరము. విచక్షణ ద్వారా ప్రశ్నించుకొనుచూ జవాబు తీసుకొనుచూ ముందుకుపోతే సరియైన జవాబు దొరుకగలదు. లేకపోతే ఇతరులు ఎట్లు చెప్పితే అట్లు చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పడము సత్యము కావచ్చును లేక అసత్యమును కావచ్చును. అందువలన ఇతరులు చెప్పినట్లు వినకుండా ఆ రోజులలో ఏమి జరిగినదో అక్కడికి పోయి చూచిన విషయము సంపూర్ణముగా తెలియగలదు. ఇప్పుడు తెలియ బోవు విషయము క్రొత్త విషయము కావున జాగ్రత్తగా వినండి.

మనుషులలో వారి ఇంద్రియ శక్తులనుబట్టి నాలుగు రకములుగా విభజించి చెప్పవచ్చును. జ్ఞానేంద్రియములలో కన్ను, చెవి రెండు చాలా ముఖ్యమైనవి. ఈ రెండిటి ద్వారానే ఎక్కువ పాపపుణ్యములు వచ్చు చుండును. శరీరములో ఈ రెండు జ్ఞానేంద్రియములకు ప్రత్యేకత కలదు. సహజముగా కన్ను, చెవి రెండు స్థూలముగాయున్న దానిని చూడగలవు, అట్లే వినగలవు. అయితే సూక్ష్మముగాయున్న దానిని కన్ను చూడలేదు, చెవి వినలేదు. సూక్ష్మముగా యున్న వాటి యెడల అందరూ ఒకే స్థితి కల్గి చూడలేక, వినలేక సూక్ష్మమును గురించి ఏమీ తెలియక ఉందురు. అయితే

సూక్ష్మ శరీరములయిన దయ్యముల పట్ల అందరూ తెలియని స్థితిలో యున్నా కొందరు అరుదుగా చూడగలరు, వినగలరు అన్నట్లుందురు. అందువలన మనుషులకున్న ఇంద్రియ శక్తులను బట్టి మనుషులను నాలుగు రకములుగా విభజించవచ్చును. ఒకటి సూక్ష్మ శరీరములు ఏమాత్రము కనపడనివారు, వినపడని వారు. వీరి కన్నులకు సూక్ష్మ ఆకారము కనిపించదు, అట్లే వీరి చెవులకు సూక్ష్మ శబ్దములు వినిపించవు. ఇలాంటి వారు నూటికి తొంభైశాతము మంది గలరు. రెండవ రకము మనుషులలో వారికంటికి సూక్ష్మ ఆకారములు కనిపించును, అట్లే వారి చెవులకు సూక్ష్మ శబ్దములు వినిపించును. ఇటువంటి వారు చాలా అరుదుగా యుందురు. అటువంటి వారిని నేను అక్కడక్కడ చూచాను. మూడవ రకము వారియొక్క కంటికి సూక్ష్మ ఆకారములు కనిపించును గానీ, వారికి సూక్ష్మ శబ్దములు వినిపించవు. అటువంటి వారిని కూడా నేను చూచాను. ఇక నాల్గవ రకము వారు ఎలా ఉన్నారనగా! వారికంటికి సూక్ష్మ ఆకారములు కనిపించవు. అయితే వారి చెవులకు మాత్రము సూక్ష్మ ఆకారములు చేసిన శబ్దములు వినిపించును. ఈ విధముగా మనుషులలో వారి కన్నులకు, చెవులకు ఉన్న శక్తులనుబట్టి నాల్గు రకముల వారున్నారని చెప్పవచ్చును.

ఈ విధముగా కన్నులకు, చెవులకు అదనపు శక్తులున్న వారిని అతీంద్రియ శక్తి కలవారని చెప్పవచ్చును. అటువంటి వారు బహు అరుదుగా యుందురు. ముహమ్మద్ ప్రవక్త గారికి సూక్ష్మ శరీర ఆకారములు కనిపించవు, కానీ సూక్ష్మశరీరము చెప్పు మాటలు, చేయు శబ్దములు వినిపించు శక్తి ఆయన చెవులకు యున్నది. జిబ్రయేల్ భూమి మీద అటువంటి మనిషి కొరకే వెతికేటప్పుడు ప్రవక్తగారు కనిపించారు. అప్పుడు జిబ్రయేల్ ప్రవక్తగారికే తన జ్ఞానమును చెప్పాలి అని అనుకొన్నాడు. అలా

అనుకోవడానికి కారణము గలదు. అదేమనగా! దేవుడు మనుషులకు జ్ఞానము తెలుపు మూడు విధానములలో రెండు విధానములు అప్పటికే అయిపోయాయి. ఇక మిగిలినది “తెరచాటు నుండి చెప్పు విధానమే”. ఆ విధానము ప్రకారము సూక్ష్మముగా యున్న జిబ్రయేల్ ఆకారము కనిపించ కూడదు. సూక్ష్మముగాయున్న జిబ్రయేల్ బోధించు మాటలు మాత్రము వినపడవలెను. అందువలన కంటికి సూక్ష్మము కనిపించక, సూక్ష్మ శబ్దములు వినిపించు ముహమ్మద్ ప్రవక్తగారు జిబ్రయేల్‌కు లభించడము వలన ప్రవక్తగారికే తన బోధ చెప్పునట్లు జిబ్రయేల్ నిర్ణయించుకొన్నాడు. తన నిర్ణయము ప్రకారము ప్రవక్తగారు కనిపించు వరకు వెదకి ఆయన కనిపించిన వెంటనే తన జ్ఞానమును మొదలు పెట్టి చెప్పాడు.

ప్రవక్తగారికి జిబ్రయేల్ చెప్పాడా లేక వాణి (వహీ) చెప్పిందాయను విషయములో మనుషులు ఏమాత్రము విచక్షణ లేకుండా మాట్లాడుచున్నారు. కొందరు వహీ ద్వారానే తెలిసిందనీ, లేదు కొందరు జిబ్రయేల్ కొద్ది దూరమునుండి చెప్పాడనీ అంటున్నారు. జిబ్రయేల్‌ను ప్రవక్తగారు చూచాడని కొందరూ, చూడలేదని కొందరు చెప్పుచూ అయోమయ పరిస్థితిలో పడవేయుచున్నారు. ఏమాత్రము విచక్షణ జ్ఞానమును ఉపయోగించక మాట్లాడుచున్నారు. అందువలన ఇక్కడ ముఖ్యముగా ఆ విషయమును గురించి వ్రాయవలసి వచ్చినది. ప్రవక్తగారు ఒక విధమైన ఇంద్రియశక్తిని మిగతా మానవులకంటే ఎక్కువ కల్గియుండుట వలన జిబ్రయేల్ ప్రవక్తగారిని ఎన్నుకొన్నాడు. ప్రవక్తగారు మొట్టమొదట తన చుట్టు ప్రక్కల ఎక్కడా ఎవరూ లేకుండా (కనిపించకుండా) యున్నప్పటికీ శబ్దముతో కూడుకొన్న మాటను విని భయపడిపోయాడు. ఆ మాటలు ఏ దయ్యానివోయని అనుకొన్నాడు. మొదట అలా భయపడిన దానివలన

మూడు రోజులు వరుసగా జ్వరము రావడము జరిగినది. తర్వాత రెండవ మారు హీరా గుహలలో ప్రవక్త ఒంటరిగా జిబ్రయేల్ మాటలను వినినా ధైర్యము తెచ్చుకొన్నాడు, భయపడలేదు. జిబ్రయేల్ కూడా రెండవమారు తాను ఫలానా వాడిననీ, నీకు దైవజ్ఞానమును బోధిస్తున్నానని చెప్పడము వలన ప్రవక్త ధైర్యముగా వినడము జరిగినది. వినిన ప్రతి మాటను ప్రవక్తగారు ఇంటికి వచ్చి ఇంటివద్ద యున్న తన అనుచరులకు చెప్పేవాడు.

కొన్ని సమయములలో ఆకాశమునుండి జిబ్రయేల్ క్రిందికి వచ్చినప్పుడు ముహమ్మద్ ప్రవక్తగారు హీరా గుహలలో లేనప్పుడు ప్రవక్త గారిని వెదకుచూ వచ్చి ప్రవక్తగారు ఎక్కడ ఉంటే అక్కడే చెప్పి పోయెడివాడు. కొన్ని సందర్భములలో పదిమంది మధ్య ప్రవక్త ప్రయాణము చేయునప్పుడు జిబ్రయేల్ ప్రవక్తవద్దకు పోయి ప్రయాణములోనే తన వాక్యములను చెప్పి పోయెడివాడు. అలా పదిమంది మధ్యలో యున్నప్పుడు చెప్పిన జ్ఞానము సూక్ష్మముగా యున్న వారు చెప్పు మాటలను వినగలుగు ప్రవక్తగారికి మాత్రమే వినపడేది. మిగతా వారికి అది తెలిసేది కాదు. తర్వాత తీరిక సమయములో ప్రవక్త తన అనుచరులకు చెప్పేవాడు. తన అనుచరులకు ప్రవక్త స్వయముగా జ్ఞానమును చెప్పుచున్నాడను నమ్మకముతోనే యుండేవారు. జిబ్రయేల్ ఎప్పుడు చెప్పినది వారికి తెలియదు కావున వారు ప్రవక్తయే స్వయముగా బోధించుచున్నాడని తలచెడివారు. ఈ విధముగా 23 సంవత్సరములు జిబ్రయేల్ జ్ఞానమును ప్రవక్తగారికి బోధించినా ఆ విషయమును ఎవరూ గుర్తించలేక పోయారు. ప్రవక్త తమ మధ్యలోయుండి జ్ఞానమును చెప్పుట వలన, జిబ్రయేల్ చెప్పునది ప్రవక్త ఒక్కనికే వినిపించుట వలన, ఆ విషయము బహుకొద్ది మందికి తప్ప మిగతా వారందరికీ ప్రవక్త చెప్పినట్లే యుండేది.

ఇట్లు జరుగుచూ 23 సంవత్సరములు గడచిపోగా ఒక దినము ప్రవక్తగారు రాత్రి రెండు నుండి మూడు గంటల మధ్యలో స్మశానములోనికి పోయి చనిపోయిన వారందరికి శుభము చేకూరవలెనని ప్రార్థన చేసి వస్తుండగా సూక్ష్మ శబ్దము ఒకటి ఆయనకు వినిపించినది. ఇతరులు చాలామంది తన చుట్టూయున్నా, ఆ శబ్దము తనకు ఒక్కనికే వినిపించడము వలన, జిబ్రయేల్ గారే ఆ మాట చెప్పారని ప్రవక్త అనుకోవడమైనది. అయితే జిబ్రయేల్ ఆ మాట చెప్పలేదని ప్రవక్తకు తెలియదు. ప్రవక్తకు కనిపించదు, కేవలము వినిపించేది అయిన దానివలన అక్కడ జిబ్రయేల్ ఉండి చెప్పాడని అనుకొన్నారు. ఆ మాట వలన "తనకు చావు దగ్గర పడినదని" తెలుసుకొన్నాడు. ఆ మాట విన్న తర్వాత తీవ్రమైన జ్వరము, కడుపునొప్పి రావడము వలన గతములో కొంతకాలము క్రిందటే తనమీద జరిగిన విష ప్రయోగము వలన తనకు ఆ బాధ వచ్చినదని అనుకొన్నాడు. ఆ బాధను దాదాపు పదకొండు రోజులు అనుభవించి చనిపోయాడు. ప్రవక్త చనిపోయిన విషయము జిబ్రయేల్‌కు కూడా తెలియదు. తర్వాత జిబ్రయేల్ భూమిమీదకు వచ్చి ప్రవక్త చనిపోయినందుకు బాధపడిపోయాడు. ఆయుష్షు అయిపోయినప్పుడు, దేవుడు ఇచ్చిన గడువు అయిపోయినప్పుడు ఎవరయినా తప్పక పోవలసిందేయని జిబ్రయేల్ అనుకొని తిరిగి పోయాడు. అయితే ఇంతవరకు "నీకు చావు దగ్గరయింది" అని ఎవరు చెప్పారో ఎవరికీ తెలియదు. జిబ్రయేల్‌కు ఆ మాటే తెలియదు.

# సమాప్తము

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# దైవ గ్రంథములో సత్యాసత్య విచక్షణ

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

